


# ప్రపంచ పరిణామము

# ప్రపంచ పరిణామము

## జవహర్‌లాల్ నెహ్రూ కుమార్తె ఇందిరకు వ్రాసిన లేఖలు

6



## రచయిత

జననం 1889. కాశ్మీర బ్రాహ్మణులు. తండ్రి మోతిలాల్ నెహ్రూ. ప్రఖ్యాత న్యాయవాది. తల్లి స్వరూపరాణి. జన్మస్థానం ప్రయాగ - అలహాబాద్. ఇంటివద్ద కొంతకాలం ప్రైవేటు చదువుకొని హారోలో, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలోని ట్రినిటి కళాశాలలో విద్య నభ్యసించారు. అలహాబాద్ హైకోర్టులో న్యాయవాదిగా జీవితాన్ని ప్రారంభించారు. 1918లో ఇండియన్ హోమ్‌రూల్ లీగ్‌కు కార్యదర్శి అయినారు. 1918 నుంచి అఖిలభారత కాంగ్రెస్ సభలో సభ్యుడుగానున్నాడు. 1921 లో మొదటిసారి కారాగృహవాసా న్ననుభవించారు. ఇప్పటికి ఎనిమిది మారులు శ్రీకృష్ణ జన్మస్థానాన్ని చూచివచ్చారు. 1929లో కాంగ్రెస్ కార్యదర్శి అయినారు. 1930 లోను 1936, 37 లలోనూ కాంగ్రెస్ అధ్యక్షులయినారు. ఈ సంవత్సరం రానున్న కాంగ్రెస్ అధ్యక్షపదవికి పోటీలేకుండా యెన్నుకొన బడినారు. వివాహితులు. భార్య-కమల నెహ్రూ-చనిపోయింది. కొడుకులు లేరు ఒక్కతే కుమార్తె - ఇందిర గాంధి. చెల్లెండ్రిద్దరు - విజయలక్ష్మి పండిట్, కృ హతిసింగ్.

ఈయన గొప్ప ప్రజాస్వామ్యవాది. ఆంగ్లంలో అనేక గ్రంథాలను ర చారు. వీరి రచనలలో 'సోవియట్‌రష్యా' ను మా ప్రచురణలలో ప్రచురి యున్నాము. విలాసం - ఆనంద భవన్, అలహాబాద్.

# ప్రపంచ పరిణామము

జవహర్‌లాల్ నెహ్రూ కుమార్తె ఇందిరకు వ్రాసిన లేఖలు

ఆంధ్రీకరణము :

మరుపూరు కోదండరామ రెడ్డి

సంస్కృతి ప్రచురణ

వెల రూ. 1—8—0.

# విషయసూచిక

# నెహ్రూ మున్నుడులు

తొలికూర్పుకు—

1928 సంవత్సరపు వేసవిలో నా కూతురు ఇందిర హిమాలయపర్వాతలలో ముస్సోరియందును నేను క్రింద సమదేశంలో వుండినప్పుడు యీ జాబులను ఆమెకు వ్రాసినాను. అవి పదేండ్లబాలికకు వ్రాసిన వ్యక్తిగత లేఖలు. కాని, కొందరు మిత్రులు వీటియందు ఏదో సుగుణమును గుర్తించి, మరికొందరు పాఠకులయెదుట వీటినుంచమని సూచించినారు. ఇతర బాల, బాలికలకు యివి నచ్చునో నచ్చవో నాకు తెలియదు. కాని, యీ ఉత్తరాల చదివిన వారు క్రమక్రమంగా యీ మన ప్రపంచము వివిధశాఖలు, జాతులుగలిగిన ఒక పెద్దకుటుంబమని భావించగలరు. ఇంతే కాకుండా వ్రాసేటప్పుడు నాకు కలిగిన ఆనందంలో లవ భాగమైన చదువరులకు కలుగగలదను ఆశగూడ నాకు కలదు. ఈ మాట కొంత జంకుతోనే వ్రాస్తున్నాను.

జాబులు తటాలున ఆగిపోయినవి. దీర్ఘ వేసవి ముగిసిపోయింది. ఇందిర కొండలు దిగి, క్రిందికి రావలసి వచ్చింది. 1929 లో ఆమెకు ముస్సోరిగాని, మరియే యితర పర్వత శీతల ప్రదేశావాసముగాని లభించినదిగాదు. కడపటి మూడుజాబులు క్రొత్తయుగాన్ని ప్రారంభించినవి; అందువలన ఒంటరిగా ఆ మూడు ఒకపాటి అప్రస్తుతాలుగా వున్నవి. ఇంతకుమించి వ్రాసేదానికి వసతిచాలదు: కాబట్టి వాటిని గూడ యిందు చేర్చివేసినాను.

ఈ ఉత్తరాలు ఇంగ్లీషులో వుండుటవలన వీటికి అంత వ్యాప్తివుండదని నాకు తెలుసును. ఆ తప్పు కేవలము నాదే. దానికి పరిహారము, వీటిని యితరభాషలలోనికి అనువదింప చేయుటయే.

అలహాబాదు,
నవంబరు, 1929 } జ. నె.

మలికూర్పుకు *—

మొదట నాకుమార్తెను ఉద్దేశించి ఈ లేఖలు వ్రాసినాను. ఇతరులయెదుట యీ లేఖలుంచను నిర్ణయించుకొనే ముందు చాలా సందేహించినాను. కాని, సహృదయమైన పత్రికాప్రపంచము, సహృదయతమమైన పాఠక ప్రపంచము వాటి కొసంగిన ఆదరము నా సందేహముల, భయముల పారద్రోలి నాకు ధైర్యమును గూర్చినది. కాబట్టి ఈ రెండవ ముద్రణమున కొన్ని స్వల్పదోషాల సవరణ దప్ప మార్పులేమియు చేయలేదు.

ఈ చిన్నపుస్తకానికి జరిగిన ఆదర, స్వాగతాలవల్ల ప్రేరేపింపబడి వీటికి మరికొన్ని చేర్ప సంకల్పించుకొన్నాను. కాని, అసూయాపరురాలైన యింకొక గృహిణిని (రాజకీయ సేవ) చేపట్టినందుననూ, ఆమె సేవలో నిమగ్నుడనై యుండి నందుననూ ఇతరవిషయాలలో ఆసక్తితీసుకొనను నాకు వసతి గాని, ఇచ్ఛగాని లేకపోయింది. గత సంవత్సరం నేను నైని

---

* 1946 కు ఇరవై ముద్రణాలు అయినవి— అనువాదకుడు.

చెరసాలలో నున్నప్పుడు యీ అభిప్రాయం మరల కలిగింది; అప్పుడు వసతికి, కాలమునకు కొదవ లేక పోయింది. కాని, చెరసాలలో జాబులు తరుచుగా సాగవు. అదిగాక జెయిలులో అవసరమైన పుస్తకాలు దొరకవు. ఇంతే కాకుండా అప్పుడు అనుదినము హిందూదేశంలో నూతనచరిత్ర నిర్మింపబడు చుండినది. దానికి అనుగుణ్యముగా నా మానసముగూడ చరిత్ర నిర్మాణ కార్యక్రమంతో నిండిపోయి యుండినందున, మృతగత చరితను గూర్చిన యోచనే నా తలలో ప్రవేశించ లేక పోయినది. కారాగార విముక్తుడనై ఒకవారపు విశ్రాం తితో మరల అందు ప్రవేశించినాను. మరల కొన్ని నెలలు దొర్లిపోయినవి. ఈ ఆంగ్లసంవత్సరాది దినమున యీ లేఖల సాగించవలెనని నూతన వత్సర ప్రతినను బూనినాను. కొంత సాగింది కాని, చాలా త్వరలోనే, జనవరి 26వ తేదిన ఉన్నట్లుండి, నన్ను విడిపించినారు. గృహచ్ఛిద్రము, ప్రజా కార్య జలావర్తములు తమ ఆవేగ భ్రమణాలలో నన్ను చిక్కించుకొని, అటు ఇటు విసరివేసినవి. మరల ఈ ఉద్య మము సాగను కారాగార ప్రశాంతి, తదనుగుణ్యమైన మానసిక శాంతులకై నిరీక్షించుచున్నాను.

మధ్యకాలంలో ఇందిర దిన దిన ప్రవర్ధమాన మగు చున్నది; ఇంకెంతకాలమో ఎదుగగల ఆమె విజ్ఞానంతో సమానంగా నా వ్రాతల నడక సాగించలేనేమో!

అలహాబాదు
అక్టోబర్, 1931

జవహర్‌లాల్ నెహ్రూ.

# ప్రపంచ పరిణామము

జవహర్‌లాల్ నెహ్రూ కుమార్తె ఇందిరకు వ్రాసిన లేఖలు



## 1. ప్రకృతి పుస్తకం

మనం యిద్దరము ఒకచోట వున్నప్పుడు అనేక విషయాలను గురించి నీవు ప్రశ్నిస్తుంటే నేను ప్రత్యుత్తరాలు యిస్తూవుండేవాడిని. ఇప్పుడు నీవు ముసోరీలో నేను అలహాబాదులో వుండటంచేత ఈ పరస్పరసంభాషణలకు వీలులేదు. కాబట్టి అప్పుడప్పుడు మన భూమిసంగతి, దాని విభాగాలైన చిన్న-పెద్ద దేశాలవిషయం వ్రాస్తుంటాను. నీవు కొద్దిగా ఇంగ్లండు, హిందూదేశచరిత్రలు చదివియున్నావుకదా! కాని యీ విశాల భూఖండంలో ఇంగ్లండు ఒక స్వల్పద్వీపము. హిందూదేశం ఒకపాటి పెద్దదైనా ఒక క్షుద్రభాగమే. ఇక యీ మన ప్రపంచకథను గురించి కొంచెమో, గొప్పో తెలుసుకోవాలంటే మన జన్మదేశాన్నిగురించి మాత్రమే తెలుసుకొంటే చాలదు. భూమండలంలో వుండే వివిధఖండాలను గురించి, అందు నివసించే ప్రాణికోటిని గురించి కూడ తెలిసికోవలసి వుంటుంది.

ఈ జాబులలో చాలా స్వల్పంగామాత్రమే చెప్పగల ననుకొంటాను. కాని యీకొద్దీ నీకు అనురక్తిని గూర్చి యీ ప్రపంచమంతా ఒక్కటేనని తోపజేసి, అందు నివసించే యితరప్రజలు నీ సోదరీ సోదరులని భావింపజేస్తుం దని నా విశ్వాసం. నీవు పెరిగి పెద్దదానవైనతర్వాత యీవిషయమై పెద్ద పెద్ద పుస్తకాల చదువుకొందువుగానిలే ! ఇవి నీవు చదివిన కథలన్నింటికంటె ఎక్కుడు మనోజ్ఞంగా వుంటవి.

మన భూమండలం చాలా పురాతనమైంది. కొన్ని కోట్లకోట్ల సంవత్సరాల ప్రాయపుదని నీకు తెలియనే తెలుసును గదా ! ఎంతో కాలం గడచేవరకు దీనిమీద స్త్రీలుగాని, పురుషులుగాని నివసించలేదు. మానవులకు ముందు జంతువులు ప్రభవించినవి. ఇక యీ జీవరాశికి ముందు, చైతన్యప్రకృతినే యెరుగని ఒక దీర్ఘతరకాలం గడచిపోయింది. ఇప్పుడు ప్రాణికోటితో యింత క్రిక్కిరిసి వున్న యీ భూమి ఒకప్పుడు జీవశూన్యమని భావించడం దుష్కరమే ! కాని వీటినిగూర్చి నిశితదీర్ఘంగా పర్యాలోచించిన, పరిశీలించిన శాస్త్రజ్ఞులు, ఒకప్పుడు యీ భూమి ప్రాణి నివసించేదానికి వీలుకానంత ఉష్ణంగా వుండిందని చెబుతారు. వారువ్రాసిన పుస్తకాలు చదివి, రాళ్లను, ఫాసిల్సును—అంటే పురాణ పాషాణాంతర్గత జీవఅస్తిపంజరాలను—చూస్తే ఇది నిజమేనని మనకు గూడా తెలుస్తుంది.

చరిత్రను నీవు పుస్తకాలలో చదువుతున్నావు. కాని పాతకాలంలో — మనుష్యులే లేనప్పుడు — పుస్తకాలు

వ్రాయడం ఎలాపొసగుతుంది ? ఇక ఏమిజరిగిందో ఎలా తెలుసుకోగలము ? వూరకే కూర్చొని వూహల అల్లలేము గదా ! అదేవీలై వుంటే మన యిచ్ఛానుగుణ్యంగా వూహల సాగించి, మనకు నచ్చిన అద్భుత వింతగాథల సృష్టించి యుందుము. అయితే అది అప్పుడు మనకు తెలిసిన విషయాలమీద ఆధారపడియుండదు కాబట్టి, యథార్థమైనదిగా వుండదు. ఆ దూరపు దినాలలో వ్రాసిన పుస్తకాలు లేక పోయినా, అదృష్టవశాత్తు, పుస్తకాలు తెలిపినంత విపులంగా – విస్పష్టంగా విషయాన్ని తెలుపగలిగిన యితర వస్తువులు కొన్ని వున్నవి. రాళ్లు – పర్వతాలు – సముద్రాలు – నక్షత్రాలు – నదులు – ఎడారులు – శిలాగర్భస్థ పురాతన జంతు అస్థిపంజరాలు– మొదలైనవే మనకు భూమియొక్క ఆదిమ చారిత్రక గ్రంథాలు. ఈకథను తెలుసుకోవాలంటే, ఇతర జాతుల పుస్తకాలను చదివేదానికంటె, ప్రకృతివ్రాసి వుంచిన యీ భూరిగ్రంథాన్ని చదవడమే సత్యమార్గమౌతుంది. ఈ రాళ్ళ – రప్పల మూలాన యీ గాథను చదువను నీవు త్వరగా ప్రారంభించాలని నా అభిమతం. అది ఎంత ఆకర్షణీయమో వూహించుకో! దారిలో కొండల ప్రక్కల పడివుండే ప్రతిచిన్నరాయిగూడ ప్రకృతి పుస్తకంలో ఒకచిన్నపుట! చదువను నీచేతనైతే, అది కొంత విషయాన్ని నీకు చెప్పగలదు. ఏ భాషనుగాని చదువాలంటే దాని వర్ణక్రమం మొదట తెలియాలగదా ? అట్లే, ప్రకృతి

కథను, దాని పుస్తకాలైన యీ రాయి, రప్పలను చదవవలె నంటే నీవు మొట్టమొదట ప్రకృతి అక్షరాల నేర్చుకోవలెను. ఇప్పటికే యీ చదువు కొంత నీకు వచ్చుననుకొంటాను. నీకు కనబడే, నున్నని చిన్నగుండ్రాయి నీకు కొంత చెప్పటలేదా? అది మూలలు, మొరికలు లేకుండా గుండ్రంగా, నున్నగా ప్రకాశించేటట్లు ఎలాఅయింది? ఒక పెద్దరాయిని పగుల గొట్టితే ప్రతిముక్కా మొరికలతో గరుకుగావుంటుంది. అది అప్పుడు గుండ్రాయిమాదిరి వుండనేవుండదు. తర్వాత యీ చిన్న గుండ్రాయి ఎట్లా నున్నగా గుండ్రంగా తళతళలాడేటట్లు అయింది? నీకు మంచి దృష్టివుండి, ఆసక్తితోవింటే దానికథ అది చెబుతుంది: ఒకానొకప్పుడు- చాలాకాలం నాడు కావచ్చును- నీవు పగులగొట్టిన రాతి ముక్కవలెనే అదిగూడ గరకుగా, చాలా ఎగుడుదిగుడు లతో కాంతి హీనంగా తాను వున్నానని అదిచెబుతుంది. బహుశా, మొదట అది ఒక గుట్టపార్శ్వాన్ని అంటుకొనివుండి వుంటుంది. ఆ తర్వాత వాన వచ్చి, క్రింది లోయలోనికి కొట్టుకొనివచ్చి కొంత సెలయేటిలో చేరింది. ఆ ప్రవాహం దాన్ని నెట్టుకొని నెట్టుకొని వచ్చి, ఒక చిన్నఏటిలో దించింది. ఆ చిన్నఏరు దాన్ని ఒక పెద్దనదికి గొనిపోయింది. ఈ దూరప్రయాణాన్ని, యీరాయి ప్రవాహంవెంట నదీ భూభాగంమీద దొర్లుతూచేసివుండిన, మొరికలు అరిగి, గుండ్ర నై, కాంతివంతమైంది. ఈవిధంగా అది నీవుచూచిన గుండ్రా

యి అవుతున్నది. ఎట్లో, ఆ నది దీనిని ఇక్కడ దిగవిడిచి పోయింది; కాబట్టే నీకు అది కనబడింది. దానినేగాన, నదీ ప్రవాహం ఇంకా మోసుకొనిపోయివుంటే, అది ఇంకా చిన్నదై - చిన్నదై చివరకు యిసుక రేణువై పోయి, పిల్లలు గూళ్ళుకట్టి - ఆడి-ఆనంద విహారంచేసే సముద్రతీరంలో తన సోదరులతో కలిసివుండేది. ఒక చిన్నగుండ్రాయే యింత కత చెప్పగలిగితే, పెద్దపెద్దరాళ్ళు, పర్వతాలు, మనచుట్టూవుండే ఇతర వస్తుజాలంనుంచి ఇంకా మన మెంత నేర్చుకోగలమో!



# 2. ఆదిమచరిత్ర రచనా విధానం

నిన్నటిజాబులో భూమి ఆదిమచరిత్రను తెలుసుకోవాలంటే ప్రకృతి పుస్తకాన్ని చదువాలని చెప్పినాను గదూ? నీచుట్టూవుండే సమస్తము - రాళ్ళు, కొండలు, లోయలు, నదులు, సముద్రాలు, అగ్నిపర్వతాలు ఆ పుస్తక భాగాలే! ఆ పుస్తకం నీముందల తెరువబడేవున్నది గాని, మనలో ఏ కొద్దిమందో దానిని గమనించనో, చదువనో ప్రయత్నం చేస్తున్నారు. దానిని చదివి, అర్థంచేసుకోను మనం నేర్చుకొనివుంటే, అది ఎన్నో అద్భుతగాథలను చెప్పగలదు! ఈ రాతి పుటలలోవున్న కథలు చాలా రామణీయకాలు.

మనభూమిపై ఎట్టిప్రాణిగాని నివసించని ఆదూరపు కాలాన్ని గురించి యీప్రకృతి పుస్తకంనుంచే తెలుసుకోవలెను. ఆచరిత చదువగాచదువగా ప్రథమజంతుగణం దృగ్గోచరమై, ఆతర్వాత మరికొన్ని జంతువులు కాన్పిస్తవి. వీటి అనంతరం స్త్రీపురుషులు వస్తారు. కాని, వారు నేటి స్త్రీపురుషులకు చాల భిన్నంగావుండి, జంతువులకు వారికి అట్టే భేదంలేకుండా, క్రూర ఆరణ్యకులుగా వుంటారు. క్రమేపి అనుభవం సముపార్జించుకొని, యోచనాశక్తిని ఉపయోగించను ప్రారంభిస్తారు. ఈ యోచనాశక్తి వారికిని, జంతువులకును మధ్య యథార్థభేదాన్ని కల్పిస్తుంది. భూరితమములు, క్రూరతమములును అయిన జంతువులకంటె శక్తియుతులుగా వారిని చేసే అసలు శక్తే అది! ఇప్పుడు ఒక పెద్దఏనుగుపై ఒకచిన్నమనిషి కూర్చుండి, తనయిష్ట

ప్రకారం దానిచేత చేయించుకోవడం నీవు చూస్తూనే వున్నావు. ఏనుగు బలవంతమైన భూరిసత్వం అవటమే కాకుండా, దానిమెడపై కూర్చొని దానిని లొంగదీసుకొనే మావటివానికంటె ఎంతో బలకారి. మావటివాడు వివేచనాశక్తి కలిగియుండుటవల్లనే అతడు యజమాని కాగా, ఏనుగు బానిస అవుతున్నది. ఇట్లు, మనిషిలో యీ యోచనాశక్తి ఎదిగేకొలది అతని విజ్ఞానము, తెలివితేటలు పెరిగినవి. నిప్పుచేసేది, భూమిదున్ని తన ఆహారాన్ని పండించుకొనేది, గుడ్డనేసి ధరించేది, ఇల్లుకట్టి నివసించేది-ఇలాంటివి చాలా సంగతులను కనిపెట్టినాడు. అనేక స్త్రీ పురుషులు ఒకటిగా నివసించేవారు; ఇదే మొదటి పట్టణాలకు అంకురము. ఈ పట్టణ నిర్మాణానికి పూర్వం, మానవులు ఒకచోటునుండి ఇంకొకచోటికి క్రుమ్మరుచూ, బహుశా, ఒకవిధమైన గుడారాలలో కాపురం చేస్తుండేవారు. ఆ దినాలలో తమ ఆహారపదార్థాలను భూమిలో పండించుకోవడం వాళ్ళకు తెలియదు. కాబట్టి బియ్యంగాని, రొట్టెలు చేసుకోను గోధుమలుగాని వారికి లేవు. నాడు కూరగాయలుగూడ లేవు. నేడు మనం తినేవి చాలవరకు వారికి తెలియనే తెలియవు. బహుశా వారు కొన్ని అడవికాయల గింజల, దుంపలను తినేవారేమోగానీ, ప్రధానంగా వారు చంపిన జంతువుల మాంసంమీాదనే ఆధారపడి వుండివుండాలి.

పట్టణాలు ఎదిగినకొలది, ప్రజలు అనేక శిల్పాలు అలవరచుకొన్నారు; వ్రాసేదిగూడ నేర్చుకొన్నారు కాని, చాలా కాలంవరకు వ్రాసేదానికి కాగితం లేనందున భోజవృక్ష

పత్రాల(బెరడు)మీదనో, తాళపత్రాలమీదనో వ్రాసేవాళ్లు. ప్రాయశా, భోజవృక్షాన్ని ఇంగ్లీషులో బర్చ్ అంటారేమో! ఆ పూర్వదినాలలో తాటిఆకులమీద వ్రాసిన పూర్తిపుస్తకాలు, కొన్ని గ్రంథాలయాలలో ఇప్పటికిని యింకావున్నవి. ఆ తర్వాత కాగితం వచ్చింది. దానితో వ్రాతగూడ సులభమైందిగాని, అచ్చుకూటాలు లేనందున, యీ దినాలలోవలె ఒకేముఖంగా వేలకొలది ప్రతులు ఉత్పత్తిచేసేదానికి వీలులేకుండా వుండేది. ఒకపుస్తకాన్ని ఒకసారివ్రాసి, దాన్నే దీర్ఘశ్రమతో చూచివ్రాసుకొంటుండేవాళ్ళు. ఇలా ఎన్నో పుస్తకాలు వుండలేవుగదా! ఒకపుస్తక విక్రేత దగ్గరకు వెళ్ళగానే పుస్తకం లభించదు; చూచి వ్రాసియిచ్చే మనిషిని నీవు కుదుర్చుకొని పుస్తకాన్ని తయారుచేయించుకోవాలి. దీనికి చాలాకాలం పట్టేది. కాని, ఆదినాలలో మహాద్భుతంగా వ్రాసేవాళ్ళు. ఇప్పటికిగూడ వారి చేతి వ్రాతపుస్తకాల ప్రతులు, అందచందాలవి, చాలామన గ్రంథాలయాలలో వున్నవి. హిందూదేశంలో, ముఖ్యంగా సంస్కృతము, పారసీకము, ఉరుదు భాషలలో యిట్టిపుస్తకాలు చాలావున్నవి. సాధారణంగా యీ వ్రాయసగాండ్రు పుటల అంచులలో చుట్టూ పుష్పపత్రతోరణాలు మొదలైన చిత్రాలను కళాపూర్ణంగా, మనోజ్ఞంగా చిత్రించేవాళ్ళు.

పట్టణాల వ్యాప్తితోగూడ భిన్నదేశాలు, భిన్నజాతులు ఏర్పడినవి. ఒకేదేశంలో ప్రక్క-ప్రక్కన నివసించుచుండిన ప్రజలు ఒకరినొకరు బాగా తెలుసుకోగలిగినారు. ఇతరదేశాలలో వుండేవారికంటె తామే అధికులమని

భావించి, బుద్ధిహీనంగా వారితో పోరాడుచుండినారు. ఒకరి నొకరు చంపుకోవడం, మానవుడు చేయదగిన తెలివితక్కు వలలో మొదటిదని, అప్పటివారుగాని, యిప్పటివారుగాని గ్రహించుకో లేకున్నారు. ఈ మారణం ఎవరికినీ మేలు కూర్చదు.

ఈ పురాతనదేశాల, పట్టణాల వృత్తాంతం తెలిసికో వాలంటే ఒక్కొక్కప్పుడు కొన్నిపాతపుస్తకాలు లభిస్తవి. అవి చాలినన్ని లేకపోయినా ఇతరఅంశాలు మనకు సాయపడ తవి. ఆదియుగ రాజులు, సార్వభౌములు వారివారి పాలనా వివరాలను రాళ్ళమీద, స్తంభాలమీద చెక్కించిపెట్టినారు. పుస్తకాలు దీర్ఘకాలం మనవు; కాగితాలు చీకి, పురుగులు తిని జీర్ణించి పోతవి; కాని రాళ్ళు కలకాలం నిలువగలవు. అలహాబాదు కోటలో అశోక చక్రవర్తి నిర్మించిన పెద్ద రాతికంబము నీకు జ్ఞాపకమున్నదనుకొంటాను. అనేకవేల ఏండ్లక్రితం భారతదేశాన్ని పాలించిన గొప్ప సామ్రాట్టు ఈ అశోకుడు; ఆయనసందేశం ఒకటి యీ స్తంభంమీద మలిచివున్నది. లక్నో పురాణ వస్తుప్రదర్శనశాలకు పోయి చూస్తే, యిట్టి చెక్కడాలుండే రాళ్లు అక్కడ చాలా కని పిస్తవి.

వివిధదేశాల పురాతన చరిత్ర మనం చదివేటప్పుడు చాలాకాలానికి ముందే-అంటే యూరపుదేశాలు ఆటవిక, అనాగరిక జాతులతో నిండియుండిన దినాలలోనే చైనా, ఈజిప్టుదేశాలు నెరవేర్చిన అద్భుతకార్యాలు ప్రస్ఫుటంగా గోచరిస్తవి. శక్తిప్రదమై, సకలైశ్వర్యాలతో తులతూగుచూ,

రామాయణ మహాభారతాది ఉద్గ్రంథాలసృష్టించిన కాలం నాటి హిందూదేశ చరిత్రను నీవు చదివి, ఆనందించగలవు. ఇక ఇప్పుడో? మనదేశం దరిద్రభాజన మైపోయి విదేశీయుల ఏలుబడిక్రింద పడివున్నది. మనదేశంలోగూడ మనకు స్వాతంత్ర్యంలేదు. మనం స్వేచ్ఛానుసారంగా ఏదీ చేయలేము. ఈస్థితిలో మనదేశం సదా వుండలేదు. బహుశా మనం కష్టపడి ప్రయత్నిస్తే మన దేశ దాస్యబంధాన్ని వదలించి, బీదప్రజలస్థితి బాగుచేసి నేడు యూరపు ఖండములో వున్న కొన్ని దేశాలమాదిరి మనదేశాన్ని గూడ సౌఖ్యప్రదమైన దానినిగా చేయవచ్చును.

ఈతూరి జాబులో భూమి పుట్టుపూర్వోత్తరాల రామణీయకగాథ మొట్టమొదటనుంచి ప్రారంభిస్తాను.



# 3. భూమి పుట్టువు

భూమి సూర్యునిచుట్టూ, చంద్రుడు భూమిచుట్టూ తిరుగుతుంటారని నీకు తెలియునుగదా! భూమివలెనె సూర్యునిచుట్టూ తిరిగే యితరగోళాలు చాలా వున్నవనిగూడ తెలుసునుగదా! వీటిని, మనభూమిని సూర్యసంబంధమైన గ్రహాలంటారు. చంద్రుడు భూమిని అంటుకొని వ్రేలాడుతుంటాడు; కాబట్టే చంద్రుని భూమ్యాధారి అంటారు. ఇతర గ్రహాలకుగూడ ఇట్టి అనుచార ఉపగ్రహాలున్నవి. సూర్యుడు యితరగ్రహాలు, వాటి ఉపగ్రహాలు అన్నీచేరి నిత్యం కలకలలాడే ఒకకుటుంబం; దీనినే సౌరకుటుంబం - సౌరవిధానం- అంటారు. సౌర అంటే సూర్యశబ్ద విశేషణం. అనంత గ్రహరాసికి సూర్యుడు జనకుడు; కాబట్టే దానికి సౌరకుటుంబ విధానం అంటారు.

రాత్రిపూట వేనకువేలు నక్షత్రాలు ఆకాశంలో కనిపిస్తవి. వీటిలో గ్రహాలు బహుస్వల్ప సంఖ్యాకములు. వాటిని నక్షత్రాలని అననే అనరు. గ్రహం ఏదో, నక్షత్రం ఏదో నీవు తెలుసుకోగలవా! నక్షత్రాలతో పోల్చిచూస్తే మన భూమివలెనే యీ గ్రహాలు గూడ చాల చిన్నవి; అయితే మనకు చాలా సమీపంలో వుండటంచేత యివి పెద్దవిగా కనబడుతున్నవి. ఇట్లే మనకు అత్యంతం దగ్గరగా వుండటంచేత పరిమాణంలో కందుప్రాయుడు అయినా చంద్రుడు పెద్దగా కాన్పిస్తున్నాడు. నక్షత్రాలను, గ్రహాలను కనుగొనే

సులభమైనవిధం, అవి మినుకు మినుకుమంటున్నవో లేదో చూడడమే! నక్షత్రాలు మినుకు మినుకుమని చలిస్తుంటవి; గ్రహాలు నిలబడి ప్రకాశిస్తవి. దీనికి కారణం – గ్రహాలు మన సూర్యునినుండే కాంతిని గ్రహించడమే! గ్రహాలలోను, చంద్రుడిలోను మనం చూచేది వాటిపై ప్రతిబింబించిన సూర్యకాంతే ! అసలుచుక్కలు మన సూర్యునివంటివి. అవి గూడ అత్యుష్ణంగా మండుతూ వుండడంచేత స్వయం ప్రకాశితాలు. అసలు సంగతేమిటంటే, మనసూర్యుడు గూడ ఒక నక్షత్రమే ! సూర్యమండలం మనకు దగ్గరవుండడంవల్ల జ్వలించే గోళంవలె పెద్దదిగా గోచరమగుచున్నది.

మనభూమి సూర్యకుటుంబానికి, అంటే సౌరవిధానానికి, జెందింది. మనం భూమి చాలా పెద్ద దనుకొంటాం; దాన్ని మన క్షుద్ర పరిమాణాలతో పోల్చిచూస్తే అది పెద్దదే! వేగంగాపోయే ఒక ట్రెయినులోగాని, స్టీమరులోగాని ప్రయాణం చేసినప్పటికీ భూమి ఒక భాగంనుండి ఇంకొక భాగానికి పోవాలంటే వారాలు, నెలలు పడతవి. భూమి మన కెంతపెద్దదిగా కనిపిస్తున్నప్పటికిన్నీ ఇది వాయుపథంలో వ్రేలాడుచుండే ఒక ధూళిరేణువే! సూర్యుడు మనకు కొన్ని కోట్ల మైళ్ళదూరంలో వున్నాడు. నక్షత్రాలు ఆపైన ఇంకా చాలా దూరంలో వున్నవి.

నక్షత్రాలనుగూర్చి విమర్శించే శాస్త్రకోవిదులు, చాలాచాలా కాలానికిముందు భూమి, ఇతర గ్రహాలు సూర్యుని భాగాలుగా వుండినవని చెబుతారు. ఇప్పటి మాదిరే అప్పుడుగూడా సూర్యుడు మహాదారుణంగా మండే

జ్వలిత పదార్థంగా వుండినాడు. ఎట్లో సూర్యునినుండి కొన్ని ముక్కలు విడబడి గాలిగుండా దూరి పడినవి. కాని, అవి వాటి జనకుడైన సూర్యుని సంబంధము బొత్తిగా వదలించుకో లేక పోయినవి ఏదో ఒక మోకుతో కట్టివేసినట్లు అవి సూర్యునిచుట్టూ తిరిగాడుచునే వున్నవి. మోకుతో పోల్చిన యీవింతశక్తి చిన్నవస్తువులను పెద్దవాటివైపుకు లాగు తుంది. ఈశక్తే వస్తువుల భారానుగుణ్యంగా వాటిని క్రింద బడేటట్లు చేసేది. మన సమీపంలో వుండే పెద్దగోళం భూమే కాబట్టి, మనదగ్గరవుండే ప్రతిదానిని అది ఆకర్షిస్తున్నది.

ఇతర ఖండాలవలెనే భూమిగూడా సూర్యునినుండి విరిగి బయటపడింది. మొదట ప్రచండోష్ణవాయువులు దాని చుట్టూరేగుతుంటే భూమి చాలా వేడిగా వుండివుంటుంది. కాని, ఇది సూర్యునికంటె అత్యంత స్వల్పమైంది. కాబట్టి త్వరలోనే చల్లారను ప్రారంభించింది. సూర్యుడుగూడా చల్లారుతున్నాడు, కాని అందుకు కోట్లతరబడి సంవత్సరాలు పడుతుంది. భూమి తొందరగానే చల్లారింది. వేడిగావుండి నప్పుడు ఎట్టిజీవకోటిగాని-మనిషి, జంతువు, చెట్టుచేమ ఏమీ గాని-భూమిమీద నివసించి యుండదు గదా! అప్పుడు అన్నీ దహించుకొని పోయివుంటవి.

సూర్యభాగం వూడిపడి భూమిఅయినట్లే ఒకభూ ఖండంవిరిగి జారిపోయి చంద్రుడు అయింది. అమెరికా, జపాను దేశాలమధ్య యిప్పుడు శాంతమహాసముద్రం (పసిఫిక్) అనబడే పెద్దసొట్టనుండి వీడిపోయిన ముక్కే చంద్రుడని చాలామంది శాస్త్రజ్ఞు లంటారు.

ఇట్లు భూమి చల్లార నారంభించింది; దీనికి చాలా కాలం పట్టింది. క్రమేణా భూమి పైభాగం చల్లారిపోయింది గాని, ఇంకా లోగర్భం మండుతూనే వున్నది. ఇప్పటికీ ఒక బొగ్గుగని లోపలికి దిగి, క్రిందికి పోనుపోను వేంద్రం ఎక్కుతూ వుంటుంది. భూగర్భంలోపలికి, యింకా లోతుకు పోగలిగినట్లయితే బహుశా, అక్కడ యింకా ఎర్రగా మండుతూనే వుండవచ్చు. చంద్రగోళం చల్లార నారంభించి, భూమికంటె చాలా చిన్నది కాబట్టి, భూమికంటె త్వరగా చల్లారింది. చంద్రుని శైత్యం ఆహ్లాదకరంగా వుంటుందిగదా! అందుకే చంద్రుని శీతాంశు డంటారు. బహుశా, హిమప్రదేశాలతోను, హిమవాహినులతోను చంద్రుడు నిండివుంటాడు.

భూమి చల్లారినప్పుడు వాయుమండలంలో వ్యాపించి యుండిన ఆవిరులన్నీ ఘనీభవించి, నీరై, వానగా క్రిందకు దిగివుంటవి; ఆదినాలలో బ్రహ్మాండమైన ధారగా, నిరంతరాయంగా చాలాకాలం కురిసివుండాల. ఆనీరంతా భూమి పల్లములను నింపింది; కనుకనే సముద్రాలు, మహాసముద్రాలు ఏర్పడినవి.

భూమి, భూమితోబాటు సముద్రాలు చల్లబడినకొలది, భూమిపైన, సముద్రాలలోను జంతురాసి పుట్టి పెరిగేదానికి వీలైంది. ముందుజాబులో భూమిపైన జీవకోటి ప్రారంభ దశను చర్చిస్తాం.

---

# 4. ప్రథమ జీవజంతువులు

పోయిన జాబులో, చాలా కాలానికి ముందు, భూమి ఏ జీవజంతువుగాని నివసించేదానికి వీలుగానంత వేడిగా వుండివుండాలని తెలుసుకొన్నాము. ఎప్పుడు భూమిపైన ప్రాణోత్పత్తి అయింది ? ఆదిమప్రాణి ఏది ? అన్నది చాలా ఆకర్షణీయమైన ప్రశ్నే. కాని, దాని ప్రత్యుత్తరంమాత్రం చాలా క్లిష్టమైంది. మొదట ప్రాణం (చైతన్యం) అంటే ఏమిటో పరిశీలిస్తాం. మనుష్యులు – జంతువులు ప్రాణులని బహుశా నీవు చెప్పవచ్చును. కాని, చెట్లు – పొదలు – పువ్వులు – కూరగాయపాదులు, వీటి సంగతేమిటి? నిజానికి అవిగూడ నివసిస్తున్నవి. అవి ఎదిగి, నీరు త్రాగి, గాలి పీల్చుకొని, చివరకు చచ్చిపోతున్నవి. జంతువుకు చెట్టుకు ప్రధాన భేదమేమిటంటే, చెట్టు ఒకచోటు నుండి ఇంకొక చోటుకు కదలదు. లండన్ నగరంలో 'క్యూ' ఆరామంలో నీకు కొన్ని మొక్కలు చూపినా; అవి జ్ఞాపకం వున్నవా ? ఈ మొక్కలు (ఆర్ చిడ్స్-పిచ్చర్) ప్రత్యక్షంగా యీగలను తినివేస్తవి. ఇక,స్పాంజివంటి మెత్తటి జంతువులున్నవి. ఇవి సముద్రపుటడుగును అంటిపెట్టుకొని వుండి, చలనమే ఎరుగవు. ఒక్కొక్కప్పుడు ఒకప్రాణి జంతువో- వృక్షమో చెప్పడంగూడ చాలాకష్టం. నీవు జంతుశాస్త్రంగాని, వృక్ష శాస్త్రంగాని చదివితే, అటుపూర్తిగా జంతువుకానటువంటి ఇటు చెట్టుగాని కానటువంటి వింతజీవులను గూర్చి తెలుసుకొంటావు.

రాళ్లు రప్పలకు, బండలకు గూడ ఒకవిధమైన జీవం వున్నదని, అవీ ఒకవిధమైన బాధను అనుభవిస్తవి అని కొందరు చెబుతారు. కాని, ఇది చూడడం చాలా దుర్ఘటం. జెనివాలో, మనలను చూడవచ్చిన ఒక పెద్దమనిషి-బహుశా నీకు జ్ఞాపకం వున్నదనుకొంటా. ఆయనే (ఇప్పుడు స్వర్గీయుడు) జగదీశచంద్రబోసు - తన పరిశోధనలమూలకంగా, వృక్షజాతికి చైతన్యశక్తి విశేషంగా వున్నదని నిరూపించినారు. ఇంతే గాకుండా, రాళ్ళకుగూడ కొంతజీవం వున్నదని ఆయన విశ్వాసం.

చూచినావు గదూ, ఏవస్తువు చేతనమో, ఏవస్తువు అచేతనమో చెప్పడం సులభమైన పనికాదు. కాని, ప్రస్తుతానికి రాళ్ళను వదలివేసి, వృక్షాలు, జంతువుల సంగతిని గురించియోచిస్తాం. నేడు జీవగణం అనంతసంఖ్యగా వున్నది. అవి విభిన్నాలు. స్త్రీపురుషు లున్నారు. వారిలో కొందరు తెలివైనవారు, మరికొందరు తెలివితక్కువవారు. ఆతర్వాత జంతువులలో ఏనుగు, కోతి, చీమలవలె అతిమేధావులు, ఇంక కొన్ని చాలా బుద్ధిహీనమైనవి వున్నవి. చేపలు, సముద్రంలో వుండే ఇతరజీవకోటి జీవవిధానంలో ఇంకా అధమకక్షకు చెందే వున్నవి. ఈ అధమకక్షలో అడుగున స్పాంజి, పాగు వంటిచేపలు (జెల్లిఫిష్) వున్నవి. ఇవి సగం జంతువు సగం చెట్టు.

ఈ వివిధ భిన్న అనంత జంతుగణం అంతా ఒక సమూహంగా ఉన్నట్లుండి ఒకే క్షణంలో ఉత్పన్నమైనదా? లేక, క్రమేపి ఒకదాని వెంబడి ఒకటి రూపొందినదా అనే

విషయాన్ని తెలుసుకోను మనం యిప్పుడు ప్రయత్నిస్తాం.



పాషాణాంతర్గతమైన మొక్క (ఫాసిల్)

ఇది ఎట్లా కనుక్కోవడం? ఈ ప్రాచీన యుగాన్ని గూర్చిన

సచ్రమపుస్తకా లేవీలేవు. ఇక ప్రకృతిపుస్తకమైనా తోడ్పడ గలదా ? ఇదే మనకు ఆధారం. ప్రాచీన పాషాణాంతర్గత మైన కొన్ని జంతు అస్తికలు మనకు కనబడుతున్నవి. వీటినే ఫాసిల్సుఅంటారు. చాలా చాలా కాలానికి ముందు, అంటే- యీరాళ్లు రూపొందుచుండిన దినాలలో, మనకు కనబడిన యీ ఎముకలజంతువులు నివసించి వుండాలని మనం చెప్ప వచ్చును. ఇట్టి ఫాసిల్సును - చిన్నా పెద్ద వాటిని, అనేకంగా లండన్ నగరంలోని సౌత్ కెన్సింగ్టన్ పురాణవస్తు ప్రదర్శనశాలలో నీవు చూచి వున్నావు.

ఏదైనా ఒకజంతువు చనిపోగానే దాని మెత్తటి మాంసభాగాలు అతి త్వరగా చెడిపోతవి. కాని, దాని ఎము కలు మాత్రం చాలాకాలం నిలిచి వుంటవి. ఇట్టి అస్తిపంజ రాలే మనకు గాన్పించి, ఆ దూరపుదినాలలో నివసించిన ప్రాణికోటిసంగతి కొద్దో, గొప్పో చెపుతున్నవి. అయితే, పాముచేపవలె ఒకజంతువుకు ఎముకలు లేవనుకొందాం. ఇక, అది చనిపోతే.దాని గుర్తు ఏమీ నిలువదు.

రాళ్ళను బాగా పరిశీలించి,కనిపించిన ఫాసిల్ ఎముక లన్నిటిని సముపార్జించి, సమాలోచిస్తే, వివిధయుగాలలో నివసించుచుండిన వివిధజంతువులను మనం గుర్తించగలము. అవన్నీ ఆధారరహితంగా, ఒకేమారు ఎక్కడనుండో ఆకాశంనుండి వూడిపడలేదు. మొట్టమొదట నత్తలు-గవ్వ చేపల వంటివి - గవ్వనాశ్రయించుకొని జీవించేజంతువులు, నిర్మాణంలో క్లిష్టతలేనివి వుండినవి. నీవు సముద్రతీరాన ఏరుకొనే అందమైన రంగురంగుల గవ్వలు చచ్చిపోయిన

జంతువుల అస్థిమయ తనుత్రాణాలే! ఆ తర్వాత క్లిష్టశరీర నిర్మాణంగల పాములు, మన ఏనుగులకంటె ఇంకా బ్రహ్మాండమైన జంతువులు, ఆపైన యిప్పటి వాటితో పోల్చదగిన పక్షులు—జంతువులు, చిట్టచివరకు మానవ శరీరావశిష్టాలు గాన్పిస్తవి అంటే, జంతువుల పుట్టుకలో ఏదో ఒకపద్ధతి వుండిందా? అని దోపజేస్తున్నది. మొదట క్లిష్టరహిత నిర్మాణం గలవి, ఆతర్వాత రానురాను నిర్మాణం క్లిష్టతరం కావడం, చిట్టచివరకు, ఉన్నతోన్నత జంతువు అనదగిన మానవుడుం ప్రభవించడము జరిగినట్లు గోచరమాతున్నది. ఎట్లా చిన్న స్పాంజి, గవ్వచేప వృద్ధిఅయి - మారి - తమంతతాము పెరిగి - పరిణమించి - నేటి ఆకృతి నొందినవో అదంతా ఒక హృదయంగమమైన గాథ. ఎప్పుడో ఒకనాడు నీకు వినిపిస్తానులే! కాని, యిప్పుడు మనకు కావలసింది ఆదిమ ప్రాణి సంగతే!

బహుశా, భూమి చల్లబడగానే, మొదటి ప్రాణి ఎముకలులేని మెత్తటి పాగుచేప (జెల్లిఫిష్) గా వుంటుంది. ఈపాగుచేపలుచుట్టూ గవ్వగాని, ఎముకగాని లేకుండా సముద్రంలో నివసించేవి. వీటికి ఎముకలు లేనందున ఫాసిల్సు (పాషాణాంతర్గత అస్థిపంజారాలు) లేవు. కాబట్టి వీటిసంగతంతా మన వూహలమీదనే ఆధారపడివుంటుంది. వాటివలె పాగువంటి పాచి పదార్థాలు ఇప్పటికిగూడ సముద్రంలో విశేషంగా వున్నవి. వాటి ఆకారం గుండ్రంగావున్నా, గవ్వగాని ఎముకగాని లేనందున నిరంతరాయంగా మారుతునే వున్నది.

వాటికి మధ్య ఒక రంధ్రం వుంటుంది. ఈ మధ్య భాగమే ఒకవిధమైన హృదయం. ఈ జంతువులు-వీటిని ఇంకే



పేరుతోనైనా పిలువు - చిత్రవిచిత్రంగా విడిబడి రెండు అవతవి. ఒకచోట ఇవి పలుచబడను ప్రారంభించి, క్రమేణా ఆచోట పలుచనై పలుచనై రెండుగా తెగి, మొదటి పాగు పదార్థంతో సమానమైన రెండు పదార్థాలౌతవి.



ఈ తెంపు మధ్యభాగంలోనే, అంటే - దాని హృదయంలో ఏర్పడి, ఆ రంధ్రాన్ని గూడ రెండూ పంచుకొంటవి. క్రమేణా యీ హృదయం ప్రత్యేకమైన వాటి మధ్యభాగానికి చేరుకొంటుంది. ఇట్లా యీ పాగు విధివిరామం లేకుండా, అనంతంగా చీలుతూ ఎదిగి పోతున్నది.

మన భూమిపై యిట్లాంటిదే ఏదో ఒకటి ఆదిమ జీవిగా వుండవలె. జీవితానికి ఇవి ఎంత హ్రస్వక్షుద్రబింబములు! అప్పటిలో ప్రపంచమంతటిలోను దీనికిమించిన ప్రాణేలేదు. యథార్థజంతువు యింకారాలేదు. ఇక మానవుడు కొన్నికోట్ల ఏండ్లదాకా రాడు.

—

# 5. జంతోత్పత్తి అయినది

మన భూమిపై, ప్రథమ చైతన్యచిహ్నాలు బహుశా, క్షుద్రనిర్మాణంగల చిన్నచిన్న సముద్రజంతువులు, నీటి తుంగలు అయివుంటవని మనం చూచినాం. అవి నీటిలో మాత్రమే జీవించగలిగి, బయటికి వచ్చి ఎండితే, యిప్పుడు పాగుచేప బయటకు కొట్టుకొనివచ్చి ఎండి చచ్చిపొయ్యేట్లు చచ్చిపోయి యుండును. కాని, ఆ దినాలలో యిప్పటికంటె జాస్తిగా నీరువుండి, నెమ్ముప్రదేశం విస్తారంగా వుండివుండవలెను. ఆ తర్వాత కొంచెం బిరుసు చర్మంగలిగిన యీ పాగుచేపలు పొడి నేలమీద, ఇతర జీవాలకంటె కొంచెం దీర్ఘకాలం మనివుండేవి. దీనికి కారణం, ఇవి అంతత్వరగా ఆరిపొయ్యేవి గావు. ఈ విధంగా రానురాను ఎండు నేలమీద, సునాయాసంగా నివసించలేని మెత్తటి పాగు (జెల్లి) చేపలు పలుచబడిపోయి, బిరుసు చర్మాల జంతువులు వృద్ధి అయినవి. ఇది మనోజ్ఞమైన విషయము! అంటే, జంతువులు తమ పరిసరాను గుణ్యంగా మెల్లమెల్లగా మారి ఆ వాతావరణ పరిస్థితుల అలవరచుకొని జీవిస్తవి, అన్నమాట. మంచు విశేషంగా వుండే దేశాలలో శీతకాలంలో అక్కడ నివసించే పక్షులు, జంతువులు ఎట్లా మంచుమాదిరే తెల్లగా మారేది, చెట్లు విశేషంగా పచ్చటిప్రకృతివుండే ఉష్ణదేశాలలో అవి ఎట్లా పచ్చగానో, ఇంకా తేజోవంతమైన ఇతర వర్ణాలుగానో మారేది, లండన్ సౌత్ కెన్సింగ్టన్ మ్యూజియంలో నీవు చూచేవున్నావు. ఇదే, జీవకోటి

తమ పరిసరాలకు అలవాటుపడి అలవరచుకోవడము అని అనడం; దీన్నే నిసర్గవరణ మంటారు. తమ పరిసరాను గుణ్యమైన వర్ణంతో సరిపోలే వర్ణం అవి తొడిగి, తమ శత్రువుల బారినుండి తప్పించుకొంటున్నవి. ప్రకృతిలో లీనమయ్యే రంగే అవి కలిగియున్న శత్రువులకంట బడటం అంత సులభంకాదు. శీతల దేశాలలో చలిబాధ తప్పించుకోను జంతువులు దేహం అంతా బొచ్చు పెంచుకొంటవి. ఈ కారణం వల్లనే పులి పసుపుగా, బట్టలతో వున్నది. అడవిలో చెట్లగుండా పులి వస్తుంటే సూర్యకాంతి మాదిరిఉంటుంది. మంచి దట్టమైన అడవులలో పులిని కనుక్కోవడం కష్టం.

జంతువులు పరిసరాల కనుగుణ్యంగా యిమిడిపోను ప్రయత్నిస్తవి అన్న విచిత్రాంశమే చాల ప్రధానమైనది. జంతువులే తమంత తామే మార్పులు పొందవు. కాని, ఇట్లా మారి, ఆ కారణంవల్ల పరిసరానుగుణ్యమైన స్థితికి వస్తే వాటికి జీవించే దానికి మంచి అవకాశాలు వుంటవి. కాబట్టే యిట్లా అలవరచుకొన్నవి వృద్ధిఅవతవి; మిగతవి క్షీణిస్తవి. ఈ అంశము చాలా విషయాలకు విపులవ్యాఖ్యానము. అంటే - క్షుద్రజంతువులు క్రమక్రమంగా గురుతరములుగా పరిణమిస్తూ వచ్చి, కొన్నికోట్ల సంవత్సరాల కాలంలో, మెల్లిగా మానవుడుగా పరిణమింప వచ్చును. మనజీవితాలు హ్రస్వాలు కావడంచేత, మనచుట్టుపట్లా అనుక్షణం జరిగే యీ మార్పును మనం గుర్తించ లేకున్నాము. కాని, ప్రకృతి మాత్రం పనిచేస్తూ, మారుస్తూ, పరిపూర్ణత చేకూరుస్తూ సాగి పోతున్నది; ఇది ఎన్నడుగాని ఆగదు, విశ్రాంతి తీసికొనదు.

భూమి యిప్పుడు చల్లారుతూవచ్చి, మెల్లిగా ఎండి పోతున్నది అనే సంగతి నీకు జ్ఞాపకంవున్నదా? వేడి తగ్గే కొంది వాతావరణం మారి, దానితోగూడ చాలావస్తువులు గూడ మారినవి. భూమి మార్పుతోగూడ, క్రమేపి జంతువులుగూడ మారి, నూతన విధములైన జంతువులు ఉత్పత్తి అయినవి. మొట్టమొదట స్వల్పసముద్రజంతువులు, వాటి వెనుక గురుతర సముద్రజీవులు సృష్టిలో గాన్పించినవి. ఆతర్వాత ఎండునేల వైశాల్యం వ్యాపించే కొలది అటు నీళ్ళలో, ఇటు నేలమీదగూడ నివసించే జంతువులు - ఇప్పటి మొసలి, కప్పలాంటివి వచ్చినవి. వీటి తర్వాత కేవలం భూమిమీదనే నివసించే జంతువులు ఉత్పన్నమై, చివరకు గాలిలో ఎగిరే పక్షులు వచ్చినవి.

కప్ప అని అన్నాను కదూ? దీని జీవితం - పరిణామం చాలా విచిత్రమైంది. జలజంతువులు క్రమేణా భూజంతువులుగా మారటం ఒక విధంగా కప్పలు తమ జీవితం ద్వారా మనకు ప్రదర్శిస్తున్నవి. కప్ప ఆదిలో చేపగావుండి, ఆతర్వాత అది భూచరమువలె రూపాంతరాన్ని బొంది, భూచరాలు అన్నిటివలెనే వూపిరితిత్తులతో గాలి పీల్చుకొంటున్నది.

భూమిమీద చైతన్యం ప్రారంభమైన ఆదిమ దినాలలో భూరితర ఘోరారణ్యాలు అలముకొని వుండినవి. భూమంతా నెమ్ముతో చితచితలాడుతూ, అరణ్యమయంగా వుండి వుండవలెను. కొంతకాలానికి యీ అడవులంతా వూడి క్రింద పడిపోయి, పైబడిన మట్టి, రాళ్ళ మొత్తంయొక్క ఒత్తిడివల్ల కొయ్య మెల్లిగా నేలబొగ్గుగా మారిపోయింది.

భూగర్భం గనులనుండి బొగ్గు త్రవ్వబడుతున్నదని నీకు తెలుసును గదా! నిజానికి బొగ్గుగనులు పూర్వపు టడవులే.

భూచరాలలో మొదటివి పెద్దపాము, బల్లులు, మొసళ్లు, వీటిలో కొన్ని నూరడుగుల పొడవుండేవి. పాము - బల్లి నూరడుగుల పొడవంటే ఎంతో వూహించుకో. లండన్ మ్యూజియంలో ఇట్లాంటి అస్థిపంజరాలు చూచింది జ్ఞాపకం ఉన్నదా? ఆ తర్వాత, చాలా దినాలకు నేడు మనం చూచే జంతువులకు ఇంచుమించు పోలికగల జంతువులు రూపొందినవి. బిడ్డలకు పాలిచ్చి పోషించేవి కాబట్టి వీటిని స్తనాలు లేక స్తన్యదాలు (మ్యామల్సు) అంటారు. ఇవి గూడ మొదటి దినాలలో ఇప్పటి వాటికంటె పెద్దవిగా వుండేవి. మనిషిని బాగా పోలివుండే స్తన్యదము కోతి. ఇంకా సన్నిహితమైనది ఏప్ అనే కోతిమనిషి. కాబట్టే మానవుడు కోతిమనిషి సంతతేనని శాస్త్రజ్ఞులు వూహిస్తారు. అంటే - ప్రతి జంతువూ తన పరిసరాలకు అనువుగా క్రమేణా అలవరచుకొని, దానురాను వృద్ధినొందింది. అట్లనే మానవుడు గూడా ఆదిలో అభివృద్ధిపొందిన కోతిమనిషే! ఇట్లా అతడు అభివృద్ధ్యోన్ముఖుడై, లేక ప్రకృతే పెంపొందజేస్తూరాగా ఇప్పుడు మానవుడు తనకు అంత్యమే లేదనుకొంటున్నాడు. తాను జంతువులకు కేవలం భిన్నుడని వూహించుకొంటున్నాడు. కాని, కోతి మనిషికి, అసలు కోతికి మనం చిన్నాయన, పెదనాయన బిడ్డలమని జ్ఞాపకం వుంచుకొనుట మాత్రం మంచిది. ఇంకా ఇప్పుడు గూడ మనలో కొందరు కోతులవలె ప్రవర్తించడం లేదా?

---

# 6. మానవా గమనము

దీనికి ముందుజాబులో భూమిమీద చైతన్యం మొదట ఎంత స్వల్పతమముగా రూపొంది, మెల్లిగా కొన్ని కోట్ల సంవత్సరాల పరిమితిలో మారి, నేటి రూపానికి పరిణామం పొందిందో చూచినాము. జంతువులు సదా తమ పరిసరాలకు అనువైన విధంగా మారి, అలవరచుకొనుటకు ప్రయత్నిస్తవి అన్న జీవపరిణామంలో ఆకర్షణీయమైన ప్రధానాంశాన్ని గూడ తెలుసుకొన్నాం. ఈ ప్రయత్నములో వాటికి చాలా నూత్నగుణాలు అలవడి, రానురాను అవి వృద్ధిఅయి పుష్టితర నిర్మాణంగల జంతువులుగా మారినవి. ఈ మార్పును లేక, యీ పురోగమనాన్ని మనము అనేక విషయాలలో గుర్తించగలము. ఉదాహరణానికి చూడు — అన్నిటికంటె మొదట ఎముకలేని జంతువులుండినవి. కాని, అవి చాలాకాలం జీవించ లేనందున, ఎముకలను పెంచుకొన్నవి. అట్లా మొట్టమొదట పుట్టినది వెన్నెముక. అదిమొదలు, ఎముకవుండేవి-ఎముకలేనివి అని జంతువులు రెండు విభాగాలైనవి. నీకూ, నీచుట్టూ, నీ ఎదుట తిరుగాడే జంతువులకు ఎముకలున్నవి గదా!

ఇక, మరలా చేపలాంటి సామాన్య నిర్మాణంగల జంతువులు, గుడ్లుబెట్టి వాటిని వదలివేసేవి పరిణామపథంలో గాన్పించినవి. అవి ఒక్కొక్క తడవకు వేనకువేలు గుడ్లుపెట్టి, త్యజించి, వాటివంక చూడనైన చూడవు. తల్లి తనబిడ్డలను గూర్చి తలచుకొననే తలచుకోదు. అది వూరకే గుడ్లను

వదలివేసి, ఆతర్వాత ఆ గుడ్లను చూచేవారే లేనందున, వాటిలో చాలవరకు నశించి, ఏ కొద్దిమాత్రమే చేపలుగా పిగిలివస్తవి. ఇది ఎంతటి వృథావ్యయము! అక్కడ నుండి పరిణామమును గమనించి పై జంతువుల పరిశీలిస్తే, వాటిగుడ్లుగాని పిల్లలుగాని బహుస్వల్పమైనా, అవి వాటిని చూచి, కాపాడి, బాగా పోషిస్తవని తెలుస్తున్నది.

కోడిపెట్టగూడా గుడ్లు పెడుతుందిగాని, అది వాటి మీద కూర్చుండి పొదిగి, గుడ్లుపిగిలి పిల్లలు బయటబడిన తర్వాతగూడ కొంతకాలం తన సంతానాన్ని పోషిస్తుంది. పిల్లలు పెద్దవైనతర్వాత తల్లి తనబిడ్డలనుగూర్చి అంతగా శ్రద్ధ వహించదు. ఆ తర్వాత, పై కక్ష జంతువులలో, పోయిన జాబులో ప్రస్తావించిన స్తన్యదాలలో ఒక పెద్దమార్పు కనిపిస్తున్నది. ఈ జంతువులు గుడ్లుపెట్టవుగాని, తల్లి గుడ్డును గర్భంలోనే వుంచుకొని, లోపలనే పొదిగి, సర్వాంగాలు ఏర్పడిన సజీవశిశువును యీనుతున్నది. ఈ శాఖకు చెందినవే కుక్క, పిల్లి, కుందేలు మొదలైనవి. భూపతనం అయిన తర్వాత, తల్లి పిల్లలకు పాలిచ్చి పెంచుతుంది.

తల్లి పిల్లలను చాలాశ్రద్ధతో కాపాడుతున్నది. ఇక్కడగూడా వృథావ్యయం చాలా కాన్పిస్తున్నది. తెల్ల (సీమ) కుందేలు కొద్దికొద్ది నెలల అంతరంతో చాలాపిల్లల యీనుతున్నదిగాని, వీటిలో చాలాభాగం చనిపోతున్నవి. ఇక, ఏనుగువంటి పై తరగతి జంతువులు ఒకేపిల్లను కని, దానిని అత్యంత శ్రద్ధతో పెంచుచున్నవి.



పాషాణాంతర్గతమైన చేప (ఫాసిల్)

చూచినావుగదూ! ఎట్లా జంతువులు తమ శరీరనిర్మాణంలో వృద్ధి అయ్యేకొంది, గుడ్లు పెట్టక, పరిమాణంలో చిన్నవైన తమవంటి వాటినే పుట్టిస్తున్నవో! పై తరగతి జంతువులు సాధారణంగా ఒక్కొక్క యీతకు ఒకేపిల్లను యీనుతున్నవి. ఇంకా పైకతే జంతువులు తమ సంతానంపైన కొంత ప్రేమ - మమకారాలను చూపుటనుగూడ గమనిస్తున్నావు. మానవుడు జంతుగణంలో ఉన్నతోన్నతుడు. కాబట్టే, తలిదండ్రులు బిడ్డలంటే ఎంతో ప్రేమజూపి గారాబంతో పోషిస్తున్నారు.

ఈ విధంగా, మానవుడు ఆదిలో క్రిందితరగతి జంతువులనుండే వృద్ధి అయివుండవలె. ఇప్పటి మానవులతో పోల్చిచూస్తే, బహుశా, ఆదిమమానవులు మానవులే అనదగివుండరు. వాళ్లు, సగం కోతిమనిషిగాను (ఏప్), సగం మానవులుగాను వుండి, వానరుల* మాదిరి జీవిస్తూ వుండివుండవలెను. జర్మనీలో, హీడెల్ బెర్గు పట్టణంలో ఒక పండితుని చూడబోయినప్పుడు, నీవు మాతోగూడ వచ్చింది జ్ఞాపకం వున్నదా? ఆయన మనకు రాళ్లమధ్యనుండి తీసిన అస్థిపంజరాలు, ఇంకా అటువంటి పురాణ వస్తుసముదాయాన్ని చూపినాడు. ఆచిన్న మ్యూజియంలో ఒక పురాతన మానవ కపాలము భద్రంగా ఒక యినుపపెట్టెలో దాచిపెట్టివుండింది. ఆ పుర్రె ఎముక ఒకానొక ఆదిమమానవునిది అని వూహింపబడుతున్నది. ఆ పునుక హీడెల్ బెర్గు ప్రాంత భూమిలో దొరుకుటచేత అతనిని హీడెల్ బర్గు మానవుడని

---

* సంస్కృతములో వా + నర = మనిషా ఏమి? అని అర్థం—అనువాదకుడు

నాం కేతికనామంతో వ్యవహరిస్తున్నారు. ఇక, ఆ దినాలలో హీడెల్ బెర్గుగాని, మరి యే యితరపట్టణంగాని లేదుగదా!

ఆ దూరపుదినాలలో ఆదిమ మానవులు తిరుగాడు చుండినప్పుడు, భూమి అత్యంత శీతలంగా వుండేది. మంచు విశేషంగా ఆవరించియుండినందున దాన్ని హిమయుగమన్నారు. ఇప్పుడు ఉత్తరధృవ ప్రాంతాలలో వుండే హిమవాహినులవంటివి ఆదినాలలో ఇంగ్లండు, జర్మనీలవరకు వ్యాపించియుండేవి. అప్పుడు మానవ నివాసం అత్యంత దుష్కరంగావుండి, మానవుడు చాలా అవస్థలు పడి వుండవలె. మంచునదులు లేని ప్రదేశాలలోనే వారు నివసించగలిగి యుండినారు. ఆకాలంలో యిప్పటి మధ్యధరా సముద్రం నీటిపాయే కాదట! ఆ చోట ఒకటిరెండు చిన్న సరస్సులు మాత్రమే వుండేవి. ఇక యెఱ్ఱసముద్రపు పోలికవలె లేవు. అదంతా భూమే! బహుశా, హిందూ దేశంలో విశేషభాగం ద్వీపంగా వుండివుంటుంది. పంజాబు,సంయుక్త రాష్ట్రాలలో కొంతభాగం సముద్రంగా వుండాలని వూహించుకో! వింధ్యపర్వతానికి దక్షిణభాగమంతా ఒక ద్వీపమై, హిమాలయ పర్వతాలను దీనిని వేరుచేసే ఒక సముద్రం వీటిమధ్య వుండినది. అప్పుడు ముసూరికి పోవాలంటే నీవు స్టీమరులో ప్రయాణం చేయవలసి వచ్చేది.

మానవుడు మొదట ఉద్భవించినప్పుడు, అతనిచుట్టూ భూరితర జంతువులు తిరుగాడుచుండడం చేత, అతడువాటికి భయపడుతూ జీవిస్తూ వుండీవుండవలెను. ఇక, నేడు మానవుడు ప్రపంచానికి సర్వాధికారి! తన యిష్టంవచ్చిన పనులు

యీ జంతువులచేత చేయించుకొంటున్నాడు. కొన్నిటిని - గుర్రం, ఆవు, ఏనుగు, కుక్క, పిల్లి - ఇంకా, యిలాంటివాటిని మచ్చిక చేసుకొంటున్నాడు. కొన్నిటిని తింటున్నాడు. కొన్నిటిని - సింహం, పులిలాంటి వాటిని వినోదార్థం వేటాడి చంపుతున్నాడు. కాని, ఆ ఆదిమ దినాలలో అతడు నిర్నిరోధాధికారి కాకపోవడమే కాకుండా, ఒక అసహాయజీవియై తానే వేటాడబడి, క్రూరసత్వాల బారినుండి తప్పించుకోను ఎడదొలిగి దాగుకొనేవాడు. ఇట్లుండికూడ, క్రమేపి మానవుడు తన స్థితిని బాగుచేసుకొంటూ, శక్తియుతుడౌచూ, చివరకు ఇతరజంతువులకంటె బలవత్తరుడైనాడు. ఇదెట్లా చేసినాడు ? శరీరబలంవల్ల కాదు. ఎందుకంటే, అతనికంటె ఏనుగు ఎన్నో రెట్లు బలకారి. ఇక దీనికి కారణం? మేధాశక్తి, మనోబలము.

ఈ జ్ఞానాభివృద్ధిని సృష్ట్యాదినుండి నేటివరకు వర్ణింపవచ్చును. యథార్థంలో మానవుని యితరజంతువులనుండి వేరుచేసేది యీ తెలివే. తెలివిలేని మానవునికి యీ జంతువులకు యేమీ భేదంలేదు.

బహుశా, మానవుడు చేసిన సృష్టిలో, కనిపెట్టిన విషయాలలో మొదటిది నిప్పు. ఇప్పుడు అగ్గిపుల్లతో నిప్పు చేస్తున్నాం. నిప్పుపుల్లలు మొన్నమొన్నటివి. ఆ దినాలలో రెండు చెకుముకిరాళ్ల తునకలను ఒకదానితో ఒకటి కొట్టి, పుట్టిన నిప్పుకణంతో ఎండుగడ్డినో, ఇంకా ఏదైనా ఎండు పదార్థమునో అంటించి, పెద్దనిప్పు చేసుకొనేవారు. ఇదిగాక, అడవులలో చెకుముకిరాయి, వెదురు మొదలైన యే యితర

వస్తువులో తమంతట తామే రాసుకోవడంచేత, ఆ ఒరపిడిలో ఒక్కొక్కప్పుడు మంటలు పుట్టుచుండెడివి. ఈవిషయంనుండి, ఏదిగాని నేర్చుకోదగినంత తెలివితేటలు జంతువులకు లేవు. కాని, మానవుడు వివేకి. కార్చిచ్చులనుండి అగ్నిప్రయోజనాన్ని గుర్తించినాడు. ఈ నిప్పు శీతకాలంలో అతని చలినాపి, ఉష్ణాన్ని గూర్చింది. ఇంకా, అతని విరోధులైన పెద్దక్రూరమృగాల భయపెట్టి తరిమివేసింది. ఎప్పుడైనా నిప్పు పుట్టితే స్త్రీపురుషులందరు చేరి, ఎండిన ఆకు అలం దానిలో వేస్తూ మంట ఆరిపోకుండా చేస్తూ వుండివుంటారు. అది ఆరిపోవడం వారికి యిష్టంలేదు. ఆ తర్వాత క్రమేణా చకుముకుల ఒరిపిడివల్ల నిప్పుకణం, దానివల్ల నిప్పు ఉత్పత్తి చేయగలమని మానవుడు కనుగొని వుండవలెను. ఇది వారికి ఒక గొప్పవిషయ శోధనమే! ఇదే మానవునికి యితర జంతువులపై అధికార మొసగినది. అదిమొదలే నిఖిల ప్రపంచరాజ్యాధిపత్యమార్గంలో మానవుడు తన శాశ్వత యానం ప్రారంభించినాడు.



# 7. ఆదిమ మానవుడు

మనిషికి ఇతరజంతువులకు వుండే ముఖ్యమైనభేదం మానవుని తెలివితేటలేనని ఇంతకు ముందు జాబులో చూచి నాము. ఈ తెలివే తన్ను నాశనంచేసి వుండవలసిన భూరి భయంకర మృగాలకంటె ఆతనిని వివేకిగా, బల వత్తరుడుగా ఒనర్చినది. మానవుని మేధాశక్తి ఎదిగేకొలది అతని శరీరశక్తిగూడ పెరిగింది. ప్రారంభదశలో తన శత్రు వులతో పోరాడను మానవునికి ప్రత్యేకాయుధములు లేవు. రాళ్ళు విసరికొట్టేవాడు. ఆ తర్వాత రాతితో గొడ్డలి, బల్లెము, ఇంకా సన్నటి సూదులు మొదలైనవి చాలా పరి కరాలు చేసినాడు. ఇట్టి పాషాణాయుధాలు చాలా సౌత్ కెన్సింగ్టన్ మ్యూజియంలోను, జెనివా మ్యూజియంలోను చూచియున్నాము.

పోయిన జాబులో ప్రస్తావించిన హిమయుగము మెల్ల మెల్లగా కొసకువచ్చి ముగియవచ్చింది. మధ్యయూరపు, ఆసియాఖండాలలో హిమవాహినులు ఎండిపోయినవి. ఉష్ణం వ్యాపించేకొంది మానవులు పలుముఖాల ప్రాకినారు.

ఆ దినాలలో యిండ్లుగాని,మరే కట్టడాలుగాని లేవు. జనులు గుహలలో నివసించేవారు. వ్యవసాయం అంటూ పొలాలలో పనిజేయడమే లేదు. మానవులు కంద మూలా దులను, వారు చంపిన జంతువుల మాంసమును తిన్నారు. వాళ్లు పొలాలలో ఏమీ పెంచలేదు కాబట్టి రొట్టెగాని, వరి అన్నముగాని ఎరుగరు. వంటచేయడం తెలియకపోయినా,

ఎప్పుడూ రాజుచుండిన సెగళ్ళలో మాంసాన్ని, బహుశా, ఉడకబెట్టుకొని యుందురు. వంటపాత్రలుగాని, పెనములు గాని, కుండలుగాని వా రెరుగరు.

ఇందులో ఒక విచిత్రాంశము! ఈ ఆరణ్యకులకు వ్రాత తెలుసును. ఇప్పటివలె కాగితంగాని, పేనాగాని, పెన్సిల్‌గాని, కుంచెగాని వారికి లేవులే! వాళ్ళు కూచి అయిన రాతి సూదులతోను, యితర నిశితాయుధాలతోను వాళ్ళు కాపురముండే గుహల గోడలమీద జంతువుల బొమ్మలు మలచేవాళ్ళు. ఆ చిత్రాలు కొన్ని బాగావున్నవి కాని, హెచ్చుతక్కువ, అవన్నీగూడ ఏకపార్శ్వ చిత్రాలు. ఇట్లా ఒకప్రక్క కనబడే బొమ్మ గీయడం సులభమని నీకు తెలుసును గదా! పిల్లలు సాధారణంగా ఇట్లనే వ్రాస్తుంటారు. ఆ గుహలు చీకటిగా వుండివుంటవి కాబట్టి వాళ్ళు ఏదో ఒక విధమైన దీపాన్ని సులభమార్గంలో సమకూర్చుకొని వుంటారు.

ఈ వర్ణించిన మనుష్యులను పురాణ పాషాణ యుగీయులు అంటారు. మానవులు తమ సమస్త పరికరాలను రాతితో చేసుకొనే వాళ్ళు కాబట్టి ఆ కాలాన్ని పాషాణయుగ మన్నారు. అప్పటికి లోహాల వుపయోగం వారికి తెలియదు. ఇక, నేడు ప్రతివస్తువు లోహమయము; విశేషంగా యినుము ఉపయోగపడుతున్నది. అప్పుడు ఇనుము, కంచు వారికి ఇంకా దొరకియుండనందున, కష్టతరమైనప్పటికిని ప్రతిదానికి రాతినే వుపయోగించేవారు.

పాషాణయుగం ముగిసేదానికి ముందే ప్రపంచ వాతావరణం ఎక్కువగా మారి, ఉష్ణం జాస్తి అయింది. మంచు పేరులు కుదించుకొని కుదించుకొని ఉత్తరధృవ ప్రాంతాలకు గుంజుకొని పోయినవి. ఆ తర్వాత మధ్య ఆసియా యూరపులలో దట్టమైన పెద్దపెద్ద అడవులు వ్యాపించినవి. ఈ అడవులలో నివసించిన ఒక కొత్త మానవజాతి మనకు కన్పిస్తుంది. వీళ్ళు పురాణ పాషాణయుగ మానవులకంటె చాలా విధాల తెలివైన వాళ్లు. కాని, ఇంకను రాతి పనిముట్లనే వాడినారు. వీళ్ళుగూడ ఆ పాషాణయుగ చరమభాగానికి చెందినవాళ్లు. వీళ్లను నవ్యపాషాణయుగపు వారని అంటారు.

ఈ నవ్యపాషాణయుగ మానవులను పరిశీలిస్తే, చాలా పురోభివృద్ధి గాన్పిస్తున్నది. మానవ వివేకం, యితర జంతువులకంటె మహా వేగంగా అతని పురోగమనాన్ని సాధ్యం చేసింది. ఈ నవ్యపాషాణయుగపువారు ఒక మహత్తరవిషయాన్ని కనిపెట్టినారు: భూములను దున్ని, విత్తనములు చల్లి, తమ ఆహారపదార్థముల అందు వుత్పత్తిచేయడం ప్రారంభించినారు. ఇది వాళ్ళకు గొప్ప విషయము! ప్రొద్దు వుదయాస్తమానం ఆహారానికి మృగాలను వేటాడవలసిన శ్రమ లేకుండా సులభంగా యిప్పుడు వారికి తిండి లభించింది. దీనివలన తీరిక ఎక్కువగా దొరికి, విశ్రాంతికి, యోచనకు అవకాశం ఎక్కువగా లభించింది. తీరిక ఎక్కువ అయినకొలది, కొత్తకొత్త విషయాలు – పద్ధతులు కనిపెట్టడంలో చాలా ముందంజ వేసినారు. మట్టి కుండలు చేయటం ప్రారంభించి, వాటితో వంట చేసుకోను ఆరంభించినారు. రాతిపనిముట్ల

తీరు అందచందాలుగా ఎదిగి, మంచి మెరుగుతో మెరసేవి. ఆవు, కుక్క, గొర్రె, మేక మొదలైన జంతువులను మచ్చిక చేసుకోవడం తెలుసుకొన్నారు. ఇంకా, నేతగూడ తెలుసు కొన్నారు.

వాళ్లు ఇండ్లలోను గుడిసెలలోను వాసంచేసేవాళ్లు. ఇతర మానవులు, అడవి మృగాలు సులభంగా పైబడి బాధించకుండా వుండేదానికి సాధారణంగా యీ గుడిసెలను సరస్సుల మధ్య, ఇతర జలాశయాల మధ్య నిర్మించుకొనే వారు. అందుచేత వీళ్ళను జలాశయవాసు లంటారు.

వీళ్ళ విషయం యింత ఎట్లా తెలిసింది? అని నీవు ఆశ్చర్యపడబోతావు. వాళ్ళేమీ పుస్తకాలు వ్రాసిపెట్ట లేదే! అయితే, యీ మానవజాతి గాథ ప్రకృతి పెద్ద పుస్తకంలో వున్నదని యింతకు ముందే చెప్పివున్నాను గదా! ఈ పొత్తము చదువుట సులభమైన పనికాదు. దానికి చాలా ఓపిక గావలెను! ఈ పుస్తకాన్ని చదువు ప్రయత్నంలో చాల మంది తమ పూర్ణజీవితాల గడిపి, పాషాణాంతర్గత అస్థి పంజరాలు మొదలగు ఆదికాల పరిశిష్టాలను పెక్కింటిని సేకరించినారు. ఇవన్నీ పురాణవస్తు ప్రదర్శనశాలలో ప్రద ర్శింప బడివున్నవి. నవ్యపాషాణయుగ మానవులు చేసినవి — బాగా మెరుగుబెట్టిన సున్నితమైన రాతి గొడ్డళ్లు, కుండలు, రాతి బాణాలు, రాతి సూదులు, ఇంకా చాలా పరికరాలు — మనము చూడగలుగుచున్నాము. ఇట్లాంటివి నీవు చాలా చూచినావు; బహుశా మరచివుంటావు. మరల వాటిని నీవు చూచినావంటే యీ విషయం బాగా అర్థమౌతుంది.

జెనీవా మ్యూజియంలో, సరోవ రావాసముయొక్క ఒక మంచి నమూనా వుండినట్లు నాకు జ్ఞాపకం. కొయ్య కంబాలు మడుగులో నాటి, పైన కొయ్య అటక కట్టి వుండింది. ఆ అటకమీద కొయ్య గుడిసెలు కట్టినారు. ఈ గుడిసెలను, దొరువు ఒడ్డును మధ్య ఒక చిన్న అట్టెడ కలిపి వుండినది.

ఈ నవ్యపాషాణయుగ ప్రజలు జంతు చర్మాలు ఉడుపులకు వుపయోగించే వాళ్లు. ఒక్కొక్కప్పుడు నూనె అగిసె నారతో (ఒక విధమైన జనుము) * నేయబడిన గుడ్డను గూడ వాడేవారు. ఈ విధమైన అవిసె చెట్లలో మంచినార వుంటుంది; దానినే బట్టలు నేయను ఉపయోగిస్తారు. ఇప్పుడు ఒక విధమైన ఉన్నిగూడ యీ అగిసెనుండి తీస్తున్నారు. ఆ దినాలలో యీ వల్కలాలు చాలా ముతకగా వుండి వుండవలె.

వీళ్లు ఈ విధంగా అభివృద్ధోన్ముఖులై సాగివచ్చినారు. రాగి, కంచుతో పనిముట్లను చేయ నారంభించినారు. రాగి - తగరము యీ రెంటికలయికవల్ల * కంచు ఏర్పడుతున్నదని నీకు తెలుసుగదా ! ఇది మూలపదార్థాలు రెంటికంటె గట్టి. వాళ్లు బంగారముగూడ వాడి, దానితో ఆభరణాలుచేసు కొని తమ డాంబికాన్ని వెల్లడించేవాళ్లు.

వీళ్లంతా రమారమి 10,000 ఏండ్లకు ముందు నివ సించి వుంటారు. మనకు సరియైన శకములుగాని, సంవత్సర

---

* Flax అనే నూనె అగిసెను సంస్కృతంలో అతసి-ఉమ అని అంటారు.

* కంచు అంటే ఆంగ్లంలో బ్రాంజు.

ములుగాని తెలియవుగదా! ఇక, యిదంతా వూహాజన్యమే. ఇంతవరకు మనము కాలాన్ని లక్షలసంవత్సరాల్లో గణిస్తుండినది నీవు గుర్తించే వుంటావు. ఇప్పుడు కొంచెంకొంచెంగా మనం ఆధునికయుగ సమీపానికి వచ్చినాము. నవ్యపాషాణయుగ మానవునికి నేటిమానవునికి మధ్య ఎట్టి హఠాత్ జనితమైన మార్పుగాని తెంపుగాని లేదు. అట్లయినప్పటికిగూడ అతని కంటె మనం చాలా వేరుగా వున్నాము. ప్రకృతి తన నిసర్గ మందమార్గంలో యీ మార్పుల సంభవింప జేస్తున్నది. వివిధజాతులు ఉత్పన్నమై ఒక్కొక్కటి తమతమ మార్గాన్ని ద్రొక్కి తమతమ జీవితాన్ని గడిపినవి. ప్రపంచ వివిధభాగాలలో శీతోష్ణస్థితులు భిన్నవిధాలుగా వుండుటచేత, మానవులు వానికి తగినట్లుగా సర్దుకొని, ఎక్కువ మార్పులను పొందినారు. ఈసంగతి ముందుముందు చర్చించుదాం.

ఇంకొకవిషయం యీదినం చెప్పాలనుకొన్నా. నవ్యపాషాణయుగాంతం సమీపించేవరకు మానవుడికి ఒకపెద్ద ఉత్పాతం సంభవించింది. ఆకాలంలో మధ్యధరాసముద్రం జలాశయం కాదని యింతకుముందే చెప్పినానుగదా! ఆచోట అప్పుడు కొన్ని సరస్సులుంటే వాటిలో జనులు నివసిస్తుండినారు. ఉన్నట్లుండి, యూరపు ఆఫ్రికాలను కలిపే జిబ్రాల్టరుప్రాంత భూభాగం కొట్టుకొనిపోయి, అట్లాంటిక్ మహాసముద్రజలం, పల్లంగావుండిన ఆమధ్యధరాప్రదేశంలోనికి వెల్లువ బెట్టింది. ఇట్లు ఆసముద్రజలం ఆపల్లానికి పారుతూ దాన్ని నింపివేసింది. ఆప్రవాహంలో, అప్పుడు ఆప్రదేశ హ్రదాలలో, ఆసమీపంలో నివసిస్తుండిన అనేకవేలమంది -

స్త్రీపురుషులు-మునిగి నశించివుంటారు. వారు, తప్పించుకొని యింకెక్కడికిగాని పోలేకపోయినారు. ఆప్రదేశమంతా-వందలమైళ్ళపర్యంతం, జలమయమై పోయింది. అట్లాంటిక్ మహాసముద్రజలం ఇంకా పారుతునే వుండి, *మధ్యధరా ప్రదేశాన్ని పూర్తిగా నింపివేసి, యిప్పటి మధ్యధరాసముద్రాన్ని కల్పించింది.

ఈ ప్రళయాన్నిగూర్చి, నీవు విని, బహుశా చదువనుగూడ చదివి వుంటావు. ఇది బైబిలులోను, మనపురాణాలలోను పేర్కొన బడియున్నది. ఈ జలప్రళయమే మధ్యధరాప్రాంతం జలమయం కావడం కావచ్చును. అది చాలా భయంకరారిష్టంగా వుండివుంటుంది. ఇక, దానినుండి బయటబడి ప్రాణాలు కాపాడుకొన్న ఏకొద్దిమందో, యీ భీభత్సాన్ని తమ బిడ్డలకు చెప్పివుంటారు. వాళ్లు జ్ఞాపకం పెట్టుకొని, తమబిడ్డలకు చెప్పివుంటారు. ఈవిధంగా యీకథ ఒకపురుషాంతరంనుండి ఇంకొకపురుషాంతరానికి అందుచూ వచ్చినది.

---

* మెడియస్ + టెర్రా = మధ్యధరా అని అర్థం-పాతప్రపంచానికి ఇది మధ్యగా వుండినది. —అనువాదకుడు.

# 8. వివిధజాతుల పుట్టుక

పోయిన జాబులో గ్రహదావాసాలలో నివసించు చుండిన నవ్యపాషాణయుగ మానవులనుగూర్చి చర్చించి నాము. వాళ్లు చాలావిధాల విశేషఅభివృద్ధిని జెందినట్లు గమనించినాం. వ్యవసాయాన్ని కనిపెట్టి, ఆహారమును వండుకొనుట, వారి పనిపాటలకు జంతువులను మాలిమి చేసుకొనుట నేర్చుకొన్నారు. ఇదంతా అనేక వేల సంవత్స రాలనాడు జరిగింది. వాళ్ళనుగూర్చి మనకంతగా తెలియదు. కాని, ఇప్పుడు ప్రపంచంలో వుండే జాతులలో ప్రాయశా, చాలవరకు యీ నవ్యపాషాణయుగంవారి సంతతిగా వుండ వచ్చును. నేను తెల్ల, పసుపు గోధుమవర్ణం, నల్ల జాతుల వారుండడం నీకు తెలిసిన సంగతేగదా! కాని, నిజానికి, మానవజాతిని యీనాలుగు జాతులుగా విభాగించడం సులభమైనది గాదు. జాతులు నానావిధాలుగా కలిసి పోయి నవి. వాటిలో చాలావాటిని గురించి, ఏజాతి ఏశాఖకు జెందిందో చెప్పడం దుష్కరం. శాస్త్రజ్ఞులు శిరస్సును కొలిచి, ఒక్కొక్కప్పుడు, ఎవడు ఏజాతికి జెందింది నిర్ణ యిస్తారు. ఇది నిర్ణయించను యితరమార్గాలు గూడ కొన్ని వున్నవి.

ఈ వివిధ భిన్నజాతులు ఎట్లా వుత్పన్నమైనవి? అందరూ ఒకేతెగనుండి రూపొందివుంటే ఒక్కొక్కరిమధ్య యిప్పుడు యింత భేదమెట్లా ఏర్పడింది? జర్మనుకు నీగ్రోకు ఎంతో వ్యత్యాసముండే సంగతి నీకు తెలుసును గదా!

ఒకరు తెల్లరంగు—ఇంకొకరు నలుపు. జర్మనీ దేశీయుని వెంట్రుకలు లేతచాయతో పొడవుగా వుంటవి; నీగ్రోవి నల్లగా పొట్టిగా వుంగరాలు చుట్టుకొనివుంటవి. చైనా దేశీయుడు యీయిద్దరికి భిన్నంగా వుంటాడు. ఈ భేదాలన్ని ఎట్లా వ్రాకినవో చెప్పడం కష్టంగాని, కొన్నిటికిమాత్రం కారణాలు చెప్పగలము. జంతువులు తమతమ పరిసరాలకు అలవాటుపడే కొంది క్రమేణా, ఎట్లా మారినవో యింతకు ముందే చెప్పియున్నా. జర్మను—నీగ్రో భిన్న జాతిమానవుల నుండి ఆవిర్భవించి వుండవచ్చును గాని, ఎప్పుడో ఒకప్పుడు వారిరువురి ఆదిపురుషుడు ఒకడుగానేయుండి యుండవలె. కాబట్టి, ఇక యిప్పుడున్న యీభేదం, వారు తమ పరిసరాను గుణ్యంగా ఇమిడిపోను జరిపిన ప్రయత్నఫలితమై ఉండవలె. కొందరు, కొన్ని జంతువులవలెనే, చాలా త్వరగా సర్దుకొని పోయి వుందురు.

ఈవిధంగా, ఉత్తరాన చాలాదూరంలో-గొప్ప చలి, మంచులో నివసించేమనిషి, చలికి ఓర్చుకొనే శక్తిని వృద్ధి చేసుకొంటాడు. ఎస్కిమో యీనాటికిగూడ ఉత్తరధృవ ప్రాంత హిమభూములలో నివసిస్తూ దుస్సహమైన శైత్య బాధను గూడ సహిస్తున్నాడు. మనదేశంవంటి వుష్ణదేశాలకు వాళ్ళను తీసుకొనివస్తే బహుశా చచిపోతారేమో! వీరికిని మిగతప్రపంచానికిని పెద్దతెంపు ఏర్పడి, కష్టజీవితాన్ని గడపవలసి వస్తున్నది. కాబట్టి, ప్రపంచ యితర భాగాలలో నివసించేవారిమాదిరి విషయాలన్నీ వీరు నేర్చుకోలేరు. ఆఫ్రికాలో, భూమధ్యరేఖకు సమీపంలో, అత్యుష్ణంగా

వుండే ప్రదేశాలలో నివసించేవారు ఆ వేడికి కూడ అలవాటై పోతారు. సూర్యప్రచండతాపము వారి రంగును నల్లబరుస్తుంది. సముద్రతీరంలోనో, ఇంకెక్కడనో నీవు విశేషకాలం ఎండలో వుంటే, కాగి రాగిరంగుగా మారి ఇప్పుడుండే దానికంటె, నల్లనై పోతావని నీకు తెలుసునుగదా! కొన్ని వారాల ఆతపస్నానం వల్ల నే నీవు నల్లబడితే, ఇక ఎప్పుడూ మండు టెండలో నివసించేమనిషి ఇంకెంత నల్లగా వుండవలె? తరతరాలుగా, అనేకవందలసంవత్సరాలు అత్యుష్ణప్రదేశాలలో నివసించే మనుష్యులు రానురాను నలుపెక్కిపోతూ చివరకు కండెన నలుపుగా తిరిగి పోతారు. మిట్టమధ్యాహ్నపు టెండలో పొలాల్లో పనిచేసే భారతకృషికుని చూచినావు గదూ? ఎక్కువవస్తువులు కొనుక్కొను శక్తిలేని పేద అగుట చేత, నిలువెల్లా కప్పను గుడ్డలులేక, దేహమంతా ఎండకు కాగుతూ, యీవిధంగా పొలాలలోనే తనజీవితమంతా గడుపుతాడు. ఇక, అతడు నలుపై తీరవలె.

ఇప్పుడు తేలింది ఏమిటంటే, మనుష్యుల శరీరవర్ణం వారు నివసించే ప్రదేశ శీతోష్ణస్థితిమీంద ఆధారపడి వుంటుంది అని. వర్ణానికి, ఆమనిషియొక్క అర్హతకుగాని, యోగ్యతకు గాని, సౌందర్యానికిగాని ఏమీ సంబంధంలేదు. తెల్లజాతి మనిషి చాలాకాలం వేడిప్రదేశాలలో నివసిస్తే - ఎండ కన్నెరుగకుండా-వేడి సోకకుండా-చలువ పందిళ్ళలో వట్టివేరు తడికెలమధ్య పంకాలక్రింద దాగుకొంటేనేదప్ప-నలుపు దిరిగిపోతాడు. మనం కాశ్మీర దేశీయులమని నీకు తెలుసును గదా! 200 ఏండ్లకుముందు మనపూర్వీకులు కాశ్మీరంలో

నివసిస్తుండినారు. కాశ్మీరంలో ప్రతివాడు-సేద్యగాడు, పని బాటలవానితోసహా - చాలా మంచి వర్ణంకలిగి వుండటం



ఆదిమ దినాలలోనున్న ప్రాణిజంతువు - 60 అడుగుల పొడవు

మనం చూస్తున్నాము. దీనికి కారణం కాశ్మీరము చాలా

చలిగావుండడమే! కాని, యీ కాశ్మీరదేశస్థులే, వేడిగా వుండే యితరప్రదేశాలకు దిగివచ్చిన తర్వాత, కొన్ని పురుషాంతరాలకు నలుపుదిరిగి పోతారు. మనమిత్రులు కొందరు కాశ్మీరదేశవాసులు బాగా తెల్లగా వున్నా, ఇంకకొందరు చాలా నల్లగా వున్నారు. ఒక కాశ్మీరకుటుంబం, యీ ప్రాంతాలలో ఎంత ఎక్కువ కాలం నివసిస్తుందో అంత ఎక్కువ నలుపెక్కుతుంది.

దీనివల్ల, శీతోష్ణస్థితే మానవుని దేహచ్ఛాయకు ముఖ్యకారణమని తేలింది. కొందరు ఉష్ణప్రదేశాలలో వున్నప్పటికిన్ని, భాగ్యవంతులు కావడంచేత, ఆరుబయట పని చేయకుండా, పెద్దపెద్ద భవనాలలో నివసించి, తమ్ము - తమ శరీరకాంతిని కాపాడుకోగలుగుతున్నారు. ఇట్లా, ఒకశ్రీమంత కుటుంబము కొన్నిపురుషాంతరాలు నివసించి, వాతావరణపు తాకుడు అనుభవించకుండానే వుండగలదు. కాని, ఒకరు స్వయంగా పనిచేయకుండా ఇతరుల కాయక్లేశంమీాద జీవించడం ఏమంత గర్వింపదగిన అంశముగాదు.

భారతదేశంలో, ఉత్తర హిందూస్థాన, కాశ్మీర, పంజాబు వాసులు సాధారణంగా మంచివన్నెతో వున్నారు. దక్షిణం పోయినకొలది నలుపు అవుతున్నారు. మదరాసు, సింహళ ప్రాంతాలలో బాగా నలుపుగా వుండటం నీవు చూచినావు. దక్షిణం పోయేకొంది భూమధ్యరేఖ దగ్గరై, వేడి జాస్తి అయినందున ప్రజలరంగు యిట్లా వున్నదని నీవు అనవచ్చును. నిజం! మనదేశంలో వివిధ ప్రాంతాల ప్రజల దేహచ్ఛాయలు మారటానికి ఇదే ముఖ్యకారణము. అయి

నప్పటికిని భారతదేశానికి వచ్చిన ప్రథమజాతుల విభిన్నత గూడ కొంతవరకు యీ వర్ణభేదాలకు కారణమని ముందు ముందు మనము తెలుసుకోగలము. గతించిన యుగాలలో



జలాశయము నడుమ కర్రలపై నిర్మింపబడిన నివాసములు

అనేకజాతులు హిందూదేశంలోకి వచ్చినవి. చాలాకాలం వరకు, విడబడి ఎడ ఎడముగావుండ ప్రయత్నించి నప్పటికిని కలగలుపును పూర్తిగా నిరోధించలేక పోయినవి. ఒక భారతీయవ్యక్తి ఫలానిజాతికే చెందినవాడు అని చెప్పడం యిప్పుడు దుష్కరము.

---

# 9. మానవజాతులు - వారి భాషలు

ఈ ప్రపంచంలో, ఏ భాగంలో మొట్టమొదట మానవోత్పత్తి అయిందో, ఎక్కడ మానవుడు ఆదిలో తన ఆవాసాన్ని నెలకొల్పుకొన్నాడో మనం చెప్పలేము. బహుశా, హెచ్చు తక్కువ ఒకే కాలంలో అనేక ప్రదేశాలలో మానవోత్పత్తి జరిగివుంటుంది. హిమయుగంనాటి పెద్ద మంచునదులు కరగిపోతూ, ఉత్తరం ఎగబ్రాకి పొయ్యే కాలంలో, మానవులు ఉష్ణ ప్రదేశాలలో నివసిస్తుండి వుంటారు. మంచు కరగిపోగా, ఆ భాగాలంతా యిప్పటి సైబీరియా (రష్యాలో) వలె విశాలమైన పచ్చిక బయళ్ళు అయిపోయి వుంటవి. తమ పశుగణానికి మేత కావాల కాబట్టి, వాళ్ళు యీ మాగాణములంతా తిరుగాడుచుంటారు. స్థిర వాసాలు లేకుండా ఎల్లప్పుడు క్రుమ్మరే యీ జాతులను ఆంగ్లంలో నోమాడ్సు అంటారు. ఇప్పుడు గూడ, చాల దేశాలలోను, మన దేశంలోను సుగాల ఎరుకల జాతులలాంటి దేశ ద్రిమ్మరులు (నోమాడ్సు) చాలామంది వున్నారు.

నదీ పరిసర ప్రదేశాలు సారవంతమై వ్యవసాయానికి అత్యంతము యోగ్యమైనందువలన, ప్రజలు పెద్దపెద్ద నదీ తీరాలలో నిలిచిపోయి వుంటారు. కావలసినంత నీరు వుండటంవల్ల ఆహారపదార్థాలు పండించను సులువుగా వుంటుంది కాబట్టి, హిందూదేశంలో మహానదులు - సింధు, గంగా ప్రాంతాలలోను, పాలస్తీనములో టిగ్రిస్, యుఫ్రటిస్ నదీ తీరాలలోను, ఈజిప్టులో నైలు పటిబడ్డునను, ఇట్లే చీనా

దేశంలోను నివాసాలు ఏర్పరచుకొని వుంటారని మనం వూహిస్తున్నాము.

భారతదేశంలో మనకు కాస్తోకూస్తో తెలిసిన ఆదిమ జాతి ద్రావిడులు. ఆ తర్వాత ఆర్యులు వచ్చినారు. ఇక్లే తూర్పునుండి మంగోలియనులు వచ్చినారు. ఈదినానికిగూడ, దక్షిణాపథంలో నివసించేవారిలో ఎక్కువమంది ద్రావిడ జనులే! వీరు ఉత్తర హిందూస్థాన వాసులకంటె నల్లటివారు. ప్రాయశా, దీనికి కారణం - ద్రావిడులు దీర్ఘతర కాలం నుంచి హిందూదేశంలో వుండివుంటారు. ద్రావిడులు చాలా అభివృద్ధిజెందిన జాతి. వీరికి ఒక ప్రత్యేక స్వభాష వుండినది. వీరు యితర దేశప్రజలతో విస్తారమైన వాణిజ్యాన్ని నడిపినారు. ఆగు! మనకథ చాల ముందుకు సాగి పోతున్నది.

ఆదినాలలో, మధ్య - పశ్చిమ ఆసియాలలోను, తూర్పు యూరపు ప్రదేశాలలోను ఒక నూత్నజాతి పెంపొందుచుండింది. అదే ఆర్యజాతి! సంస్కృతంలో గూడ కులీనుడు లేక, పెద్దమనిషి అనే అర్థం యిచ్చే యీ ఆర్యశబ్దం వున్నది. సంస్కృతం గూడ ఆర్యుల వివిధ భాషలలో ఒకటి కాబట్టి, వీరంతా, తాము చాలా యోగ్యుల మని, ఉన్నతజాతి సంభవులమని భావించుకొనేవారని తేలుతున్నది. చూడగా, వాళ్లుగూడ యిప్పటి ప్రజలమాదిరే చాలా డాంభికులుగా వుండినట్లున్నది. నీకు తెలుసుగా - ఆంగ్లేయుడు ప్రపంచములో తానే ప్రథమైకగణ్యుడని భావించుకోవడం! ఇక, ఫ్రెంచి ఆయన ఇదే విధంగా,

పరాసుజాతి ఉన్నతోన్నతమైన దనుకొనడం! ఇలాగే జర్మ నులు అమెరికనులు గూడ అనుకొంటున్నారు.

ఈ ఆర్యులు, యూరపు-ఉత్తర ఆసియాలంతా, అప్పుడు వ్యాపించిన అంతులేని పచ్చిక బీళ్ళలో తిరుగాడి నారు. కాని, వారిసంఖ్య పెరిగింది: వాతావరణం ఉష్ణ మయమై పోయింది; భూమిమీద పచ్చిక తగ్గిపోయింది; ఇక వారందరికి తినుటకు చాలినంత ఆహారం దొరికింది కాదు. అందువల్ల, యీ ఆహారాన్వేషణంలో యితర భూభాగాలకు వీరు జరిగిపోవలసి వచ్చింది. అందువల్ల యూరపుఖండా న్నంతా పరచుకొనిపోయి, మెసొపొటామియా, పర్షియా హిందూదేశాలకు ప్రాకినారు. దీన్నిబట్టి చూస్తే, యూరపు ఖండవాసులందరూ, పర్షియా, మెసొపొటామియా, ఉత్తర హిందూస్థాన ప్రజలున్నూ, వీరిలో ఒక్కొక్కరికి చాలా భేద మున్నప్పటికిన్ని, ఆదిలో అందరూ ఒకే మూల పురుషులు - అంటే-ఆర్యుల సంతతివారని తెలిసికోగలుగుతున్నాము. ఇది చాలా కాలంనాటి సంగతిలే! ఆ తర్వాత చాలా మార్పులు జరిగి, జాతులు చాలా వరకు ఒకదానిలో ఒకటి మిళితమై పోయినవి. అందుచేత, నేటి ప్రపంచ ప్రజల కూటస్థ జాతు లలో ఆర్యజాతి చాల మహత్తరమైనది.

ఇంకొక గొప్పజాతి మంగోలియనులు. ఇది తూర్పు ఆసియా, అంటే - చైనా జపాను టిబేటు సయాం బర్మా దేశాలలో వ్యాపించింది. వీటిని పసుపు జాతులంటారు. వీరికి సాధారణంగా బుగ్గ ఎముకచాలా ఎత్తుగాను, కండ్లు చిన్నవిగాను వుంటవి.

ఆఫ్రికా మొదలగు దేశవాసులు నీగ్రోలు. వీరు అటు ఆర్యులుగారు, ఇటు మంగోలియనులుగారు. వీరి వర్ణం కాటుక నలుపు. ఇక, అరేబియా పాలస్తీనవాసులు, అరబ్బులు, యూదులు ఇంకొక భిన్నజాతికి జెందినవారు.

ఈ జాతులన్నీ అనేక వేల ఏండ్లకాలంలో, అసంఖ్యాకములైన స్వల్పజాతులుగా చీలి, అప్పుడప్పుడు భిన్నజాతులతో పునర్మిళితమై పోయినవి. ఇవన్నీ తెలుసుకొనే ప్రయాస మనకిప్పుడు అవసరంలేదులే! వివిధజాతులను తెలుసుకొనే ఒకముఖ్యమైన వింతమార్గం వారిభాషలను పరిశీలించుటే! మొట్టమొదట, ప్రతిజాతికి ఒక్కొక్క ప్రత్యేకభాష వుండింది; అయితే కాలక్రమేణా యీఒక్కభాషనుండే అనేకభాషలు ఉత్పన్నమైనవి. కాని, యీభాషలన్నీ ఒకే మూలభాషాజన్యాలు; అందువల్ల ఒకేవంశానికి జెందినవి. వాటిలో సరిపోయేమాటలు యేరి, వివిధభాషల సంబంధబాంధవ్యాలను కనుకోవచ్చు.

ఆర్యులు ఆసియా, యూరపుఖండాలలో వ్యాపించుకొని పోయినందున అన్యోన్య సంబంధాన్ని నిలుపుకోలేక పోయినారు. ఆదినాలలో రైళ్ళుగాని, టెలిగ్రాములుగాని, కడకు వ్రాతపుస్తకాలుగాని లేవు కాబట్టి, ప్రతిఆర్యశాఖగూడ ఒకేభాషను తదనుగుణ్యమైన వైలక్ష్యంతో మాట్లాడుకొనేది. ఇట్లా కొంతకాలం జరిగేవరకు ఇది ఆదిమ మాతృభాషకు, ఇంకా యితరసోదరభాషలకు కేవలము విభిన్నమై పోయినది.

ఈ కారణంవల్లనే ప్రపంచంలో నేడు యిన్నిభాషలున్నవి. *

ఈ భాషలన్నిటిని మనం పరిశీలిస్తే, భాషలు అనంతంగా వున్నప్పటికిని మూలభాషలు చాలాకొద్ది అని మనం తెలుసుకోగలము. ఎట్లంటే—ఆర్యులు ఎక్కడకుపోయినా వారిభాష ఆర్యభాషాకుటుంబానికి జెందిందిగానే వుండింది. సంస్కృతము, ల్యాటిను, గ్రీకు, ఇంగ్లీషు, ఫ్రెంచి, ఇటాలియను, ఇంకా కొన్నిభాషలు ఆర్యశాఖకు జెందిన చిన్నాయన పెదనాయన బిడ్డలు. మన భారతీయభాషలలో, హిందీ, ఉరుదు, బెంగాలి, మరాఠి, గుజరాతి మొదలైనవి సంస్కృత తద్భవాలు కాబట్టి ఇవన్నీ ఆర్యభాషా సంతతివే!

ఇంకొక భూరి భాషాకుటుంబము చైనాభాష. చైనా, బర్మా, టిబేటు, సయాం భాషలు యీ సంతతివి.

మూడవశాఖ సెమిటిక్; హీబ్రూ, అరబిక్ దీనికి జెందినవే.

టర్కీ, జపాను మొదలగు కొన్నిభాషలు ఈ మూడు శాఖలలో దేనికిగాని సంబంధించవు.

దక్షిణ భారతదేశ భాషలు - తెలుగు, అరవము, మళయాళము, కన్నడము మున్నగునవి గూడ యీ మూడింటికి సంబంధించవు. ఈ నాలుగు భాషలు ద్రావిడములు, చాలా పురాతనమైనవి.

---

*ప్రపంచభాషలలో యింతవరకు 2796 భాషలు లెక్కకు వచ్చినవి. ఒక్క భారతదేశంలో నే 225 భాషలున్నవి.—అనువాదకుడు.

# 10. వివిధభాషల సంబంధము

ఆర్యులు వివిధ దేశాలకు ఎట్లా వ్యాపించి పోయింది, పోయిన చోటుకల్లా ఏదో ఒక విధంగా వారిభాషను ఎట్లా తీసుకొని పోయింది ఇంతవరకు పరిశీలించినాము. భిన్న శీతోష్ణ స్థితులు, భిన్న స్థానిక పరిస్థితులు వివిధ ఆర్యశాఖలలో అనేకమైన భేదాల కల్పించినవి. ఒక్కొక్క శాఖ తన కనుగుణ్యమైన మార్గాన కొత్తకొత్త అలవాట్లతో సంప్రదాయాలతో మారుతూ వచ్చింది. ఆదినాలలో రాకపోకలు దుస్సాధ్యం కావడంచేత, ఒక శాఖ యితర దేశాలలోవుండే ఇతర శాఖలను ఎప్పుడూ కలుసుకోలేక పోయింది. ఇట్లా ప్రతివర్గము ఇంకొక సముదాయమునుండి వేరైపోయింది. ఏదో ఒకదేశంవారు ఏదైనా ఒక విన్యూత్నాంశాన్ని నేర్చుకొంటే దాన్ని ఇంకొక దేశంవారికి చెప్పలేకపోయ్యేవాళ్ళు. కాబట్టే మార్పులు వచ్చి, కొన్ని పురుషాంతరాల తదనంతరం ఒక్క ఆర్యకుటుంబమే చీలి శాఖోపశాఖలైపోయింది. బహుశా, వారంతా ఒకే భూరికుటుంబీకులు అనే సంగతి మరచిపోయి వుంటారు. వారి ఒక్క భాషే పరస్పరభిన్నమై అనేక భాషలైపోయింది.

కాని, ఆభాషలు అంత విభిన్నంగా గాన్పించినప్పటికిన్ని భాషలన్నిటిలో సామాన్యపదాలు, సామ్యాలు చాలా వుండేవి. అనేకవేల సంవత్సరాలు గడిచిపోయినా, ఇప్పటికి గూడ వివిధభాషలలోని యీ సామ్యపదాలను ఏరి, ఒకానొకప్పుడు యీభాషలన్నీ ఒక్కటిగానే వుండివుండాలని

చెప్పవచ్చును. ఫ్రెంచి ఇంగ్లీషు భాషలలో యిట్లాంటి సామాన్యపదాలు చాలావున్నవని నీకు తెలుసునుగదా! ఫాదర్-మదర్ అనే సర్వసాధారణమైన రెండు వాడుక మాటలను పరిశీలిస్తాం:—హిందీ సంస్కృతాలలో యీ మాటలే పిత-మాతలు అవుతున్నవి గదా! ల్యాటిన్‌లో పేటర్-మేటర్; గ్రీకులో పేటర్-మీటర్; జర్మనులో Pater-(ఉచ్ఛారణ-ఫాతర్) Mutter (ఉచ్ఛారణ-ముతర్); పరాసుభాషలో పేర్-మేర్; ఇలాగే యింకా యితర భాషలలో! ఇవన్నీ చాలావరకు పోలివున్నవని కన్పించడంలేదా? అన్నదమ్ముల బిడ్డలమాదిరి వాటికి ఒకవిధమైన కుటుంబ సారూప్యమున్నది. చాలామాటలు ఒకభాషనుండి ఇంకొక భాషకు వచ్చివుండవచ్చును. ఇట్లా, హిందీ చాలా పదాలను ఇంగ్లీషునుండి అరువుతెచ్చుకొన్నది. ఇంగ్లీషుకూడ కొన్ని మాటలను హిందీనుంచి తీసుకొన్నది. కాని, ఫాదరు - మదరు పదాలుమాత్రం చేబదులుగా యితర భాషలలోకి ప్రవేశించి వుండవు. ఇవి కొత్తమాటలు కూడాకావు. మొట్టమొదట ప్రజలలో, ఒకరితో నొకరు మాట్లాడటం ప్రారంభించగానే, తల్లిదండ్రులు వుండివుంటారు కాబట్టి, వారిని ఆపేరుతో పిలిచివుంటారు. కాబట్టి యీమాటల, ఒకభాషనుండి మరియొకభాష గ్రహించి వుండదు అని మనం చెప్పవచ్చు. ఇక, ఇవి ఒకే ఆదిపురుషునినుండో, ఒకే కుటుంబంనుండో సంక్రమించివుండవలె. దీనినిబట్టి, ఇప్పుడు జాతులు భిన్న దేశాలలో దూరదూరంగా నివసిస్తుండి, భిన్న భాషలు ఉపయోగిస్తుండినప్పటికిన్ని, ఒకానొకప్పుడు

వీరందరు ఒకే పెద్ద కుటుంబసంజాతులని మనం కనుగొన గలము.

చూచాయగదూ, భాషావిషయకచర్చ ఎంత రామణీయకంగా వున్నదో! ఈచర్చ చాలా విషయాలను తెలుపుతుంది. మూడు నాలుగుభాషలు వస్తే ఇంక కొన్నింటిని నేర్చుకొనడం ఏమంత కష్టంగాదు.

ఇప్పుడు దూరదూరంగా, వివిధదేశాలలో నివసించే మనమంతా చాలాకాలానికిముందు ఒకేజాతివారమని గూడ నీకు తెలియగలదు. నాటినుంచి నేటివరకు మనం చాలా మారిపోయి,మనలో చాలామంది మన పాతసంబంధం మరచిపోయివున్నాము. ప్రతిదేశంవారు తామే శ్రేష్ఠులమని, మేధావంతులమని, ఇతరులు అన్నిటా తమంతవారు కారని భావించుకొంటారు. ఆంగ్లేయుడు తాను-తనదేశమే శ్రేష్ఠమను కొంటాడు; పరాసువాడు తనదేశాన్ని-దానికి సంబంధించిన సమస్తాన్నిగూర్చి గర్వపడుతాడు. ఇక, జర్మనులు, ఇటాలియనులు తమదేశాలకు దరిదాపే లేదనుకొంటారు. మనవారు కొందరు అనేకవిధాల ప్రపంచంలో భారతదేశానికి మించిందే లేదను కొంటారు. ఇది కేవలం భ్రమజన్యమైన దురహంకారము. ప్రతివాడు తన్నుగూర్చి తనదేశాన్నిగూర్చి మంచే భావించ వాంఛిస్తాడు. యథార్థంలో కొంతమంచి కొంతచెడ్డ కలగలుపుగా లేని మానవుడే లేడు. ఇట్లే బాగోగులు సమంగా పంచుకోని దేశమే లేదు. ఎక్కడగాని వున్న మంచిని గ్రహించి, చెడ్డను పరిహరించను మనం ప్రయత్నించవలె. మనంయిప్పుడు ముఖ్యంగా మన దేశ

విషయమై ఎక్కువ ఆసక్తితో వున్నమాట వాస్తవమే! దురదృష్టవశాత్తు మనదేశం యిప్పుడు చాలా హీనస్థితిలో వున్నది; ప్రజలు చాలావరకు దారిద్ర్యంలో దుర్భరావస్థ అనుభవిస్తున్నారు. వారికి వారిజీవితాలపట్ల మోజులేదు. ఇక వారిజీవితాలను ఎట్లా సుఖప్రదంగా చేయగలమో అది యోచించవలె. మనవిధానాలలో అలవాట్లలో మంచి వాటిని ఏరి అట్టిపెట్టుకొని, చెడ్డవాటినెల్లా పరిత్యజించవలె. ఇతర దేశాలలో మంచి గాన్పిస్తే, దాన్ని గ్రహించవలెను.

భారతీయులం కాబట్టి, మనం యిక్కడనే వుండి యీ దేశంకొరకు కృషిసల్పవలె; కాని, మనం యీప్రపంచ భూవిశాల కుటుంబానికి సంబంధించిన వారమని, ఇంతకూ అన్య దేశవాసులు ఒకప్పుడు మనరక్తబంధువులని మాత్రం మరువరాదు. ప్రపంచ మానవానీకమంతా తృప్తిపడి, సుఖమయజీవితాలను గడుపుతుంటే అంతకంటె మహత్తర మనోజ్ఞ విషయం ఇంకొకటి వుండదు. కాబట్టి, యీప్రపంచమంతా సుఖపూర్ణజీవితాలకు ఆలవాలమయ్యేటట్టు చేయను మనం ప్రయత్నించాల.

---

# 11. నాగరకత అంటే ఏమిటి?

ఇప్పుడు ప్రాచీన నాగరికతనుగురించి కొంచెం చెప్పబోతున్నా. కాని, దానికిముందు నాగరకత అంటే ఏమిటో కొంత తెలుసుకోవలెగదా! నాగరకత అంటే—ఆరణ్యక గుణాలను దిద్ది, చక్కబరచి, సంస్కరించి, వాటిస్థానే మంచి అలవాట్లను నెలకొల్పడము అని నిఘంటువు అర్థం చెబుతున్నది. ముఖ్యంగా యిది ఒక సంఘానికో ఒకజాతి సముదాయానికో సంబంధించి వుంటుంది. మృగాలకంటె ఒకపాటి అభివృద్ధిలో వుండిన అప్పటిమానవుని క్రూరస్థితిని పశుప్రవృత్తి అంటారు. ఇక, దానికి కేవలం భిన్నమైంది నాగరకత! ఆదిమ ఆరణ్యకస్థితికి మనమెంత దూరమైతే అంత నాగరకుల మన్నమాట!

కాని, ఒకవ్యక్తో, సంఘమో, నాగరికమా? లేక, ఆరణ్యకమా? అని కనుక్కొనేది ఎట్లు? యూరపు ఖండంలో, చాలామంది తాము అత్యంత నాగరకులమని, ఆసియావాసులు కేవలం ఆరణ్యకులని వారిమతం. ఆసియా, ఆఫ్రికావాసులకంటే వీరు ఎక్కువ దుస్తులు వేసుకుంటారనేనా దీనికి కారణం? అయితే, దుస్తులు శీతోష్ణస్థితుల ననుసరించి ఉంటవి. శీతలదేశాలలో ఉష్ణదేశవాసులకంటె ఎక్కువ ఉడుపులు ధరిస్తారు. లేకుంటే, ఆయుధపాణి (తుపాకి) నిరాయుధునికంటె బలవంతుడు కాబట్టి, ఆయుధపాణియే నాగరికుడౌతాడా? నాగరికుడు అనాగరికునితోడవు గాని, బలహీనుడు, బలవంతునితోగాని 'నీవు అనాగరికు'

అని చెప్పలేడు. అతడు చంపుతాడేమో అన్న భయం యితనికి వుంటుంది.

కొన్ని ఏండ్లకు ముందు ఒక పెద్ద యుద్ధంజరిగింది * నీకు తెలుసునుగదా! ప్రపంచ దేశాలు చాలామటుకు దానిలో తగు లొన్నవి. ఇక, ప్రతి దేశము ప్రతిపక్ష దేశ ప్రజను ఓపినంత మందిని చంప ప్రయత్నించింది. ఇంగ్లీషువారు జర్మనులను చంప విశ్వప్రయత్నం చేసినారు. అలాగే జర్మనులుయింగ్లీషు వారిని చంపుతూ వచ్చినారు. ఈయుద్ధంలో లక్షలాది హతు లైనారు. వేలకుతరబడి మరణపర్యంతం వికలాంగులై బాధ పడినారు; కొందరు కండ్లుపోయి గ్రుడ్డివారైనారు; మరి కొందరు కాలుచేతులు పోగొట్టుకొన్నారు. ఈ యుద్ధ వికలాంగులను చాలమందిని నీవు, ఫ్రాంసు మొదలైన దేశాలలో చూచివుంటావు. ప్యారీనగర భూగర్భ అయోమార్గాలలో వీరికిగా ప్రత్యేకమైనవసతులు ప్రతిబండిలోను కల్పింపబడి వున్నవి. ఇట్లా ఒకరి నొకరు చంపుకొని, వికలాంగులుగా చేసుకోవడం నాగరకత-వివేకముఅని అనుకుంటారా? వీథిలో యిద్దరు కొట్లాడుకొంటే పోలీసువచ్చి తగవు దీర్చుతాడు; అది చూచినవారు పోరాడుకొన్నవారి అవివేకాన్ని విమర్శి స్తారు. ఇక, పెద్ద పెద్ద దేశాలే పోరాడుకొని, లక్షలాది తమప్రజలనే చంపుకొంటే, ఆ దేశాలు ఇంకా ఎంతక్షుద్రంగా అవివేకంగా వుండవలె ? ఇదంతా, అడవిలో యిద్దరు మృగ ప్రాయులు పోట్లాడుకొన్నట్లున్నది. వీరినే పశుప్రవృత్తిగల

* 1914-18 నాటి ప్రపంచ సంగ్రామము— అనువాదకుడు.

కిరాతులంటే-ఇంతకంటె హీనంగా ఘోరంగా ప్రవర్తించే యీ దేశాలు యింకెంత పశుప్రాయంగా వుండాలనో!

ఈ ప్రశ్నను యీదృక్పథంలో పరిశీలిస్తే-యుద్ధంలో పోరి, పరస్పరం హత్యలుచేసుకొన్న ఇంగ్లండు, జర్మనీ, ఫ్రాంసు, ఇటలీ, ఇంకా చాలా దేశాలు ఎన్నటికిని నాగరక దేశాలు కానేరవు. కాని, యీ దేశాలలో కొన్ని మహత్తర విషయాలు రాణిస్తున్నవని, చాలామంది యోగ్య లున్నారని నీకు తెలుసును.

కాబట్టి, నాగరకత అంటే యేమిటో నిర్వచించి, తెలిసికోడం సులభం కాదని నీవు అనవచ్చు; నిజమే! అది చాలా క్లిష్టసమస్య! సుందరభవనాలు, చిత్రాలు, పుస్తకాలు, ఇంకా హృదయంగమమైన ప్రతిఅంశము, నిజంగా, నాగరకతాచిహ్నమే! కాని, స్వార్థరహితుడై, ప్రజాశ్రేయానికి ఇతరులతో కలిసి పాటుబడే సత్పురుషుడు పైజెప్పిన స్మారకాంకాలకంటే ఉత్తమ చిహ్నము: ఏకాకిగా పనిజేసేదానికంటె సాముదాయక కృషిశ్రేష్ఠము; సర్వజన శ్రేయానికి కలిసి పనిజేయడం శ్రేష్ఠతమము!

---

# 12. మానవవర్గాలు రూపొందినవి

ఈ భూమిమీద మానవుడు ప్రభవించిన మొదటి దినాలలో ఎట్లా మృగకల్పుడుగా వుండినాడో పోయిన జాబులలో చెప్పినాను. మెల్లిగా కొన్ని వేలసంవత్సరాలకు అతడు అభివృద్ధిజెంది మెరుగెక్కినాడు. మొట్టమొదట, యిప్పుడు కొన్ని క్రూరమృగాలు చేస్తుండినట్లు, అతనొక్కడే ఏకాకిగా జంతుకోటి నంతా తరిమి, వేటాడి చంపుతూ వుండివుండవలె. ఆ తర్వాత, ఇంక కొందరు మూకతో గుంపుగట్టి పోవడం వివేకమున్నూ, భద్రమున్నూ అని తెలుసుకొన్నాడు. ఇట్లా కొందరు గుంపుగా చేరితే, వారు బలయుతులై, క్రూర సత్వగణమో, ఇతర మానవ సంఘమో యెదిరిస్తే ఆత్మరరక్షణ చేసుకోగలుగుతారు. జంతువులుగూడ తమ భద్రతకొరకు గుంపుగట్టి తిరుగాడుచుంటవి. గొర్రె, మేక, జింక ఇంకా ఏనుగులు గూడ గుంపులుగా క్రమ్మరుతుంటవి. ఈగుంపు నెదిరించేటప్పుడు అందులో కొన్ని మేల్కొనివుండి, మందకు కాపలా గాస్తవి. తోడేళ్ల గుంపులను గూర్చిన కథలు నీవు చదివి వుంటావు. రష్యా దేశంలో చలికాలంలో ఇవి పెద్దపెద్ద గుంపులుగా తిరుగాడతవి. వాటికి శీతకాలంలో ఆకలిజాస్తి. * అందువల్ల ఆకలి

---

* తోడేలుకు ఎంతతిన్నా ఆకలి తీరదన్న ప్రతీతి. సంస్కృతంలో తోడేలుకు వృకమంటారు. కాబట్టి, ఎంతతిన్నా ఆకలి దీరని భీముని వృకోదరుడు అన్నారు భారతంలో. వృకోదరుడికి ఇంకొక అర్థం కూడ చెబుతారు. ప్రతిమానవునికి వడ్లగింజ ముక్కంత జఠరాగ్ని వుంటుందని, వృకము - అంటే అంగుష్ఠమాత్ర పరిమాణం గలిగిన జఠరాగ్ని కాబట్టి, అంత గర్భస్థంచేసుకొన్న భీముడు వృకోదరుడైనాడు.



నవ్యపాషాణయుగ మానవుని రాతిపనిముట్లు

గొన్నప్పుడు యీ గుంపు మనుష్యులపై బడుతుంది. ఒంటరి తోడేలు సాధారణంగా మనిషిపై బడదు; కాని గుంపైనప్పుడు మానవ సముదాయాన్నే ధిక్కరించను చాలినంత బలాన్ని పొందినట్లు తోడేళ్లు స్ఫురించుకొంటవి. ఇక అప్పుడు మనుష్యులు ప్రాణరక్షణానికి పరుగెత్తిపోవలసి వుంటుంది. ప్రాయకంగా, ఆ దేశంలో యిటువంటి సందర్భాలలో స్లెడ్జెస్ * మీద పారిపోయ్యే మనుష్యులకు, ఆకటితో వెన్నాడే తోడేళ్ళకు పందెములు జరుగుతుంటవి.

ఆదిమ మానవులు నాగరకతలో ఎక్కిన మొదటి మెట్టు - అందరూ ఒకగుంపుగా కూడడమే ! ఈ గుంపులనే తెగలన్నారు. వారు సాముదాయకంగా పనులు చేయ ప్రారంభించారు; ఇప్పుడు సహకారవిధానం అనే పద్ధతి అప్పుడూ వుంది. ప్రతివారు మొదట తన తెగవిషయాన్ని గూర్చి శ్రద్ధవహించి, ఆ తర్వాత, స్వవిషయాన్ని గూర్చి శ్రద్ధవహించవలసి వుండేది. ఒక తెగకు అపాయ మాపాదిస్తే, ప్రతివ్యక్తి దాని రక్షణకై పోరాడి దానిని కాపాడవలసి వుండేది. వర్గంలో ఎవరైనా ఆసంఘానికిగా పనిచేయక పోతే వాడిని తన్ని బయటకు తరిమి వేసే వాళ్లు.

మనుష్యులు సమష్టిగా ఒకపనిచేయాలంటే అందరూ ఒక నియమబద్ధవిధానంలో నడచుకోవలెను ; అట్లుగాక ఎవరికి తోచినట్లు వారుచేస్తే కట్టుబాటే సడలిపోయి,

* స్లెడ్జి = చక్రాలులేకుండా, రెయిన్‌డియర్ అనే హిమ హరిణాలవల్లనో, కుక్కలవల్లనో, మంచు ప్రదేశాలలో యీడ్వబడే బండి.

నామమాత్రావశిష్టం అయిపోతుంది; కాబట్టి, ఇందులో ఒకడు నేత కావలసి వుంటుంది. జంతువుల గుంపులలో గూడ యీనాయకమృగం వున్నది. ఇదేవిధంగా మానవ జాతి సంఘాలుగూడ వారిలో ఒక బలవంతుని తమ నాయ కుడుగా ఎన్నుకొన్నవి. ఆదినాలలో జరుపవలసిన పోరా టాలు జాస్తిగా వుండడం మూలాన నాయకవరణం బల వంతునికే లభ్యపడుతుండింది.

ఒక తెగలో అంతఃకలహాలు చెలరేగితే, త్వరలోనే ఆగూడెం ఛిన్నాభిన్నం అయిపోతుంది; కాబట్టే నాయ కుడు యిటువంటి కలతలు మొలకెత్తకుండా చూచేవాడు. కాని, ఒకవర్గం మరియొకదానితో పోరాడవలసిన అవసరం ఏర్పడివుండును—అట్లా పోరాడిగూడ వున్నవి. నిజమేమార్గం ప్రతివ్యక్తి యితరవ్యక్తులతో పోరాడే పాతపద్ధతిమీద ఇది కొంత అభివృద్ధి జెందిన విధానం.

నిజానికి, పెద్దకుటుంబాలే మొట్టమొదటి తెగలుగా వుండివుండవలె. అందరి ప్రతివాడు పరస్పరం కలసినవాళ్లుగా వుండినారు; ఆతర్వాత ఆకుటుంబాలు పెరిగి, తెగలై, పెద్దవై పోయినవి.

మానవసృష్టికి ప్రాతఃకాలమైన ఆదినాలలో, ముఖ్యం గా వర్గాలు ఏర్పడకముందు, మానవుని జీవితం చాలా కష్ట తరంగా వుండివుండవలె: అతనికి యిల్లులేదు; ఏవో కొన్ని తోళ్లు తప్ప గుడ్డలేమీ లేవు; ఇదిగాక, సదా కలహాల తోనే కాలం గడపివుండవలె. తన దైనిక భుక్తికి జంతువుల వేటాడి చంపుటో, లేక, కందమూలాదుల వెదకుటో చేయ

వలసి వుండేది. తనకు అడుగడుగునకు శత్రువులున్నట్లు తోపింప జేసివుండును. వడగండ్లు, చలి, మంచు, భూకంపాలు కలిగించే ప్రకృతికూడ తనకు విరోధి అనుకొన్నాడు. పాపం! అసహాయ క్షుద్ర బానిస! ఏ విషయపు లోతుపాతులు తెలియక, ప్రతిదానికి భయపడుతు, భూమిమీద నక్కినక్కి ప్రాకిపోతు వుండివుండవలె. వడగండ్లు పడితే మేఘమండలం నుండి ఎవరో దేవత తన్ను రాళ్లతో కొట్ట ప్రయత్నిస్తున్నాడనుకొనేవాడు; ఇక అతడు భయవిహ్వలుడై తనపైకి యీ వుత్పాతాల ప్రయోగం చేసి పంపినందులకు ఆ మేఘాలలో వుండే వ్యక్తి ప్రీత్యర్థంగా ఏదన్నా చెయ్యాలనుకొనేవాడు. ఇక, ఆయనను మెప్పించే దెట్లా? అతని బుద్ధి అంత స్ఫుటంగా ఇంకా వికసించలేదు. మబ్బులలో వుండే దేవుడు తనవంటివాడే అని భావించుకొని, భోజనం కోరతాడేమో అని అనుకొన్నాడు. అందువల్ల ఏదో ఒక జంతువును చంపి, గూడెపు పెద్దలు చెప్పినట్లు బలి అర్పించి, ఆ దేవతలు ఆరగించేదానికి, ఆ నైవేద్యాన్ని ఎక్కడనో దాచివుంచేవాడు. ఆ దేవుడు వానల, వడగండ్ల ఆపగలుగుతాడని అతని వూహ.

ఇక, వాన వడగండ్లు ఎట్లా వచ్చేది తెలిసిన మనకు యీ తంతు అంతా అవివేకంగా కాన్పిస్తుంది; జంతుబలికి దానికి ఎలాటి సంబంధమూ లేదు. ఇది అవివేకమైనా, యీ దినాలలోగూడ యిది నమ్మి బలులిచ్చే మూఢు లింకా వున్నారు.

---

# 13. మతముల ప్రారంభము - కార్యకలాప విభాగము

ఆదిమ మానవుడు ఎట్లా ప్రతిదానికి భయపడుతూ వుండి, సంభవించిన ప్రతి అరిష్టముగూడ కోపబడిన దేవతలు పట్టుదలతో కలిగిస్తుండినట్లు భావించుకొనేవాడో ఇంతకు ముందటి ఉత్తరంలో చెప్పివున్నా. ఈవూహాజన్యమైన దేవతలు అడవిలో, కొండలో, లోయలో, మబ్బులో - ప్రతి చోట వారికి ప్రత్యక్షమయ్యేవాళ్ళు. వారిభావనలో దేవుడు సౌమ్యుడు,దయామయుడుగాక,అనుక్షణం కోపంతో పొంగే ముక్కోపి అయినాడు. వాళ్ళు ఆయన కినుకను గూర్చి మహాభయపడి, ఏదో ఒకటి, ముఖ్యంగా ఆహారము లంచంగా యిచ్చి, ఆయన కోపతాపాన్ని ఉపశమింపజేయను ఎప్పుడూ ప్రయత్నించేవాళ్ళు. ఒక్కొక్కప్పుడు భూకంపము, వరద, విశేషజననష్టము కలిగించిన చీడ, మొదలైన ఉత్పాతాలు సంభవిస్తే వారు భయపడిపోయి, దేవతలకు కోపం వచ్చిందనుకొనేవాళ్లు. అప్పుడు ఆ దేవతలను ప్రసన్నుల జేయను నరబలియివ్వడమే కాకుండా, తమ బిడ్డలనే చంపి, ఆ దేవతలకు ఆహుతి యివ్వనుగూడ సంసిద్ధులయ్యేవారు. ఇది ఘోరంగా కాన్పిస్తున్నది. కాని, భయవిహ్వలుడు దేనికైనా తెగిస్తాడు.

ఇదే మతానికి ప్రాతిపదిక అయివుంటుంది. కాబట్టి మతం మొదట భయరూపకంగా వచ్చిన దన్నమాట! ఇక, భయంచేత ఏదిచేసినా చెడుపే అనవలె. మతం అనేకమనోజ్ఞ

విషయాల మనకు చెప్తుందని నీకు తెలుసు! నీవు పెరిగి పెద్దదానవైనప్పుడు, ప్రపంచ మతాలను గురించి, వాటిపేర సాగించిన లగ్గు, ఎగ్గులను గురించి చదువగలవు. ప్రస్తుతం, మతం మానవభావసరణిలో ఎలా మొలకెత్తింది అన్న సంగతిమాత్రం ఆకర్షణీయంగా వున్నది. ఇక ముందు, మతం ఎలా ఎదిగిందో చూస్తాం. కాని, మతం ఎంత గొప్పగా ఎదిగిపోయినప్పటికిని, దానిపేర ప్రజలు పోరి, ఒకరి తల నొకరు పగులగొట్టుకోవడం నేటికిగూడ చూస్తున్నాం. చాలామందికి, ఇంకా అది భయపడదగిన విషయంగానే వున్నది. వారు అట్టిభయ భావకల్పిత వ్యక్తులను తృప్తిపరచను, దేవాలయాలలో నైవేద్యాలుపెడుతూ, జంతుబలుల అర్పిస్తూ, తమ కాలాన్నంతా వ్రయిస్తున్నారు.

ఈవిధంగా, ఆదిమమానవుడు చాలా కష్టజీవితాన్ని గడపినాడు. ప్రతిదినము తన భుక్తికి శ్రమపడవలసి వచ్చింది. లేకున్న కడుపు మాడవలసిందే. సోమరి ఆదినాలలో బ్రతుకలేడు. ఎక్కువ తిండిదినుసులు సేకరించుకొని, కొంతకాలం విరామంగా వుండడం అప్పుడు ఎవరికిగాని సాధ్యమైన పనిగాదు.

తెగలు ఏర్పడగానే, మానవునికి ఒకపాటి సౌలభ్యం లభించింది. వర్గంలోనివారంతా ఉమ్మడిపనిచేసి, ఒక్కొక్కరు వేరువేరుగా సేకరించిన ఆహారముకంటె ఎక్కువ సంపాదింప గలిగినారు. అందరు కలసి, అన్యోన్య సహకారంతో ప్రయత్నిస్తే, వ్యక్తులు చేయగలిగినదానికంటె ఎక్కువగా చేయను తోడ్పడుతుందని నీకు తెలిసిన విష

యమే! ఒకరిద్దరు పెద్దబరువు మోయలేక పోవచ్చునుగాని, అనేకులు పరస్పరమైన తోడ్పాటుతో దానినే సులువుగా మోయగలుగుతున్నారు. ఆదినాలలో ఉపయోగానికి వచ్చిన ఇంకొక అభివృద్ధికరాంశాన్నిగూర్చి ఇంతకుముందే ప్రస్తావించివున్నా. అదే వ్యవసాయము! ఈ వ్యవసాయాంకురాలు, కొన్ని చీమలలోగూడ కాన్పిస్తున్నవంటే నీకు ఆసక్తి కలుగవచ్చును. అంటే, చీమలు దున్ని చల్లి మహాసూలు చేసుకొంటవని నేను చెప్పడం లేదు; కాని యీచీమలు చేసేపని ఒకవిధంగా వ్యవసాయంమాదిరి వుంటుంది అని అంటున్నా. తమ తిండికి పనికివచ్చే గింజలపొద కాన్పించగానే, చీమలు ఆపుట్టచుట్టూ బలిసివున్న గడ్డిగాదం అంతా జాగ్రత్తగా పెరికివేస్తవి; దీనివల్ల ఆపొద పోదిగా ఎదిగి, మంచికాపు యివ్వను అవకాశం కలుగుతున్నది.

బహుశా, మానవులుగూడ ఒకప్పుడు యీచీమలు చేసినట్లే చేసివుంటారు. అప్పుడు వారికి సేద్యం అంటే ఏమిటో తెలిసి వుండలేదు. అది వారికి తెలియను, ఆతర్వాత విత్తులుచల్లను చాలా దీర్ఘయుగాలు పట్టివుండవలె.

వ్యవసాయ యుగారంభంతోగూడ ఆహారసేకరణం సులభతరమైపోయింది. ప్రొద్దుగూకేలూ మానవులు తిండికై వేటాడి తిప్పలు పడవలసియుండలేదు. అందువల్ల మునుపటి కంటె ఒకపాటి సులభజీవితాల గడపగలిగియుండినారు. ఇంకొక విచిత్రమైన మార్పు జరిగింది! వ్యవసాయానికి ముందు ప్రతివాడు వేటకాడే! పురుషుడు చేయవలసినపని అదొక్కటే. బహుశా, స్త్రీలు బిడ్డలపోషించి పండ్లు వేరు

కొని వచ్చేవారు. కాని, సేద్యంతోగూడ చాలా కొత్త పనులు కల్పించుకొని వచ్చినవి. పొలాలలో సేద్యము, వేట, పశువులమేపుట ఏర్పడినవి. ఆడవాళ్లు గొడ్లనుకాచి పాడి చేసి వుంటారు. మగవారు కొందరు ఒకపని, ఇంకకొందరు ఇంకొకపని చేసినారు.

నేడు, ప్రపంచంలో ప్రతివ్యక్తి ఒక ప్రత్యేకమైన కార్యాన్ని సాగించడము చూస్తున్నాము. ఒకరు డాక్టరు, ఇంకొకరు వంతెనలు, బాటలు నిర్మించే యింజనీరు, మరొకరు ఇండ్లుకట్టే తాపీపనివాడు; ఇలాగే చెప్పులు కుట్టువాడు, బట్టలుకుట్టువాడును వున్నారు. ప్రతివానికి ఒక్కొక్క ప్రత్యేక విద్య-వ్యాపారము వున్నవి; అతనికి యితర విద్యలు తెలియనే తెలియవు. అథవా, తెలిసినా అందు బహుస్వల్పపరిచయంకలిగివున్నాడు. దీన్నే కార్యవిభాగము లేక పనిపంపకము అంటారు. ఒకడు అనేక కార్యాలకు కడంగకుండా, ఒకపనిని బాగా చేయగలిగితే అది సాంతంగా బాగా పూర్తిఅవుతుంది. నేటిప్రపంచ కార్యక్రమంలో కృషి విభాగం చాలా విస్పష్టంగా ఏర్పడి వున్నది.

పురాతన జాతులలో, వ్యవసాయప్రవేశంతోబాటు యీ పనిపంపకం మెల్లగా ప్రారంభం కావడము మనకు బాగా కన్పట్టుతున్నది.



# 14. వ్యవసాయము కలిగించిన మార్పులు

పోయిన ఉత్తరంలో పనిపంపకాన్ని గూర్చి కొంత చెప్పివున్నా. మొట్టమొదట, కేవలం వేటాడిమాత్రమే మానవులు జీవిస్తున్నప్పుడు కృషివిభాగం ఏమంతగా లేదు. ప్రతివాడు మృగయాసక్తుడై యుండి, చాలా కష్టం మీద పొట్ట నింపుకో గలుగుతుండినాడు. ఆదిలో కార్య విభాగం స్త్రీపురుషులమధ్య యేర్పడివుంటుంది. మగవారు వేటకుపోతే, ఆడవారు యింట బిడ్డలను చూచుకొంటూ, గొడ్డుగోదను పాలించుకొంటుండినారు.

ప్రజలు వ్యవసాయాన్ని తెలిసికోగానే, ఎన్నో అభి వృద్ధికర విషయాలు సంభవించినవి. మొదటనే పనిపంపకం బాగా చీలిపోయింది. కొందరు వేటకు, మరికొందరు పొలం కాపలాకు, ఇంక కొందరు దున్ని సాగుచేయను నియోగింప బడినారు. ఇంకా, కాలంగడచి, అనుభవం చేకూరేకొలది, ప్రజలు క్రొత్తవృత్తుల నేర్చుకొని, వాటిలో ప్రత్యేక జ్ఞానాన్ని గడించినారు.

నేల సాగుబడివల్ల ఏర్పడిన యింకొక విచిత్రాంశ మేమంటే- ప్రజలు పల్లెలలో, పట్టణాలలో స్థిరవాస మేర్ప రచుకొని, అక్కడక్కడనే నిలిచిపోసాగినారు. సేద్యం వచ్చే దానికి ముందు జనం వూరకే తిరగాడుతూ, వేటలో నిమగ్నులై వుండేవారు; అప్పుడు నిలకడగా ఒకేచోట ఉండవలసిన అగత్యం వారికి లేకుండేది; ఎక్కడ బడితే అక్కడ వేట

దొరికేది. పైపెచ్చు, వారికున్న ఆవులు, గొఱ్ఱెలు యింకా యితర జీవాల మందలవల్ల ఒకచోటు నుండి యింకొక చోటుకు పదేపదే మారవలసి వస్తుండేది. ఈ పశుగణానికి మేయను మంచి పచ్చికబీళ్లు కావలసివుండేది. కొంతకాలం పశువులు కాలారా తిరిగి మేసి, త్రొక్కేసరికి, ఆపైన ఆ నేలలో మందకు చాలినంత కసవు-గడ్డి పట్టేది గాదు; అందువల్ల గూడెమంతా యింకొకప్రదేశానికి తరలిపొయ్యేది.

సేద్యంవల్ల మనుష్యులు పొలాలదగ్గరనే వుండవలసి వచ్చింది. తాము కష్టపడి దున్ని చల్లినభూమిని విడిచిపెట్టి పోలేక పోయినారు. కాబట్టి, ఒక కొంతకాలం మొదలు యింకొక మహాసూలు వరకు ఆ చేలలోనే పనిచేసుకొంటూ వుండినందున పల్లెలు పట్టణాలు ఏర్పడినవి.

వ్యవసాయం కలిగించిన ఇంకొక పెద్దమార్పు-జీవన యాత్ర సుకరంకావడం. ఆజన్మమరణాంతం నిత్యమూ ఆహారానికి అడవులు, గుట్టలు తిరిగి, చంపి సేకరించుకొనే దానికంటె సేద్యంచేసి భూమిలో తిండి పండించుకోవడం సులభమార్గమైంది. ఒకేసారి తినగలిగిన దానికంటె ఎక్కుడుగా ఆహారాన్ని భూమి యిచ్చింది. ఈ మిగిలిన ఆహారాన్ని జాగ్రత్తగా దాచిపెట్టుకొన్నారు.

ఇప్పుడు ఇంకొకవిచిత్ర పరిణామాన్ని గమనించు. మానవుడు కేవలం వేటకాడే అయి యుండినంతవరకు ఏమీ మిగిల్చి దాచిపెట్టుకోలేక పోయినాడు. ఒకవేళ దాచినా బహుస్వల్పమే వెనుక వేసుకో గలిగినాడు. తన ధనాన్నిగాని, ధాన్యాన్నిగాని భద్రపరచుకోను బ్యాంకులులేవు. ప్రతిదినమూ

కాలుచేయి ఆడితేనే పొట్టపూడేది. ఇక వ్యవసాయ ప్రవేశంతో నిత్య అవసరాలు తీరగా మిగిలేటంత ఒకేతడవ భూమి యిచ్చింది. ఈ మిగులును అతడు నిలువజేసి దాచిపెట్టుకొన్నాడు. అప్పుడే అవసరాలకు మించిన ఆహారం కల్పించడం ఆరంభమైనది. ఆ పూటకు కావలసిన తిండికి పడవలసిన కష్టానికంటె కొంచెం ఎక్కువగా శ్రమపడటంవల్ల ప్రజలకు యీ అధికఆహారం లభించింది.

ఇప్పుడు ప్రజలు తమ నిలువ ధనాన్ని బ్యాంకులలో పెట్టుకొని, కావలసినప్పుడు చెక్కులద్వారా తీసుకొంటున్నారని నీకు తెలుసునుగదా! ఈధనం ఎక్కడనుండి వస్తున్నది? నీవు యోచిస్తే, యీడబ్బంతా ఖర్చుకాగా మిగిలిన సొత్తు అని తెలుస్తుంది. అంత—ప్రజలు దానినంతా ఒకేపరి వెచ్చించివేయను యిష్టపడనందున మిగులును బ్యాంకులలో పెట్టుకొన్నారు. ఇటువంటి మిగిలిన సంపద ఎక్కువగా వున్నవారే నేటి శ్రీమంతులు; బీదలకు ఏమీలేదు. ముందు ముందు యీమిగులుదల ఎలా యేర్పడేది చూస్తువుగాని. దీనికి కారణం శ్రీమంతుడు బీదవానికంటె ఎక్కువగా పాటు బడుతాడని గాదు. ఈదినాలలో పనిపాటలలో శరీరాలు అలయనివారికే యీమిగులు ఏర్పడుతూ, చమటోడ్చి మండుటెండలో పాటుబడే కష్టజీవికి అసలే కూటికి దొరకడంలేదు! ఇది తెలివితక్కువ పద్ధతిగా లేదూ? ఈ అవివేక విధానం వల్లనే ప్రపంచంలో నేడు యిందరు పేదలున్నారని చాలామంది అనుకొంటున్నారు. ప్రస్తుతం యిది నీకు అవ

గాహన కావడం కొంత ప్రయాసగానే వుంటుంది. అట్లుంటే, దీనితో బాధపడబోకు; త్వరలోనే నీవు తెలుసుకో గలుగుతావు.

ఇక, వ్యవసాయ ప్రారంభంతో అతడు తన నిత్యావ



అతి ప్రాచీన చిత్ర లిపి.

సారలకు మించి పండించగలిగాడు. దీన్ని దాచిపెట్టినాడు. ఆదినాలలో డబ్బు లేదు–బ్యాంకులు లేవు. ఆవులు, గొర్రెలు, ఒంటెలు, గింజలు బాగా విరివిగా వుండినవారే ఆనాటి భాగ్యవంతులు.



# 15. కులపతి ప్రారంభము

నా జాబులు కొంచెం క్లిష్టమౌతున్నవేమో అని నా భయము. కాని, మనచుట్టు మనం చూస్తున్న జీవచరిత్రే చాలా సంకీర్ణంగా వున్నది. సృష్ట్యాదిలో ఇప్పటికంటె సరళంగా వుండినదిగాని, మనం యిప్పుడు పరిశీలించేకాలానికి క్లిష్టత ప్రారంభమైంది. మన విమర్శనము నిదానంగా సాగిస్తూవచ్చి, ప్రాణికోటిలోను సంఘంలోను మార్పులు ఎలా కలుగుతూ వచ్చినవో మనం అర్థంచేసుకొంటే, నేటి విషయాలు చాలావరకు మనకు సుబోధకాలౌతవి. ఇది చేయను ప్రయత్నించకపోయినచో, మనచుట్టు జరిగే విషయాల తెలిసికొననే మనచేతగాక పోతుంది; దట్టమైన అడవిలో దారితప్పిన పిల్లకాయలమాదిరి అవుతాము. కాబట్టే నేను యిప్పుడు నిన్ను ఆచీకటడవి అంచుకు మరలా త్రిప్పి తీసుకొనిపోజూస్తున్నా; అట్లయితే ఆ అరణ్యాన్ని దాటను మంచిత్రోవలో పడుతాము.

రాజులను గురించి, వారెవరో–వారెలా–ఎందుకు రాజులైనారో నీవు నన్ను మసూరిలో అడిగిన సంగతి నీకు జ్ఞాపకం వుండవలె. ఆదిలో రాజత్వం పుట్టిన ఆదూరపు దినాలలోనికి ఇప్పుడు ఒక క్షణం తొంగిచూడబోతున్నాం. మొదట వారిని రాజులనలేదు; కాని వారినిగూర్చి తెలిసికొనబోతేనే రాచరికం ఎలా ప్రారంభమైంది మనకు తెలుస్తుంది.

తెగలు ఎలాపుట్టింది ఇంతకుముందే చెప్పివున్నా. సేద్యం అలవాటులోకివచ్చి, పనిలో భేదము విభాగము ఏర్పడినందున, గూడెంలో ఒకపెద్దమనిషి యీకార్యకలాపాన్నంతా నిర్ణయించి సాగించవలసిన అగత్యం ఏర్పడింది. దీనికిముందు గూడ, ఒకవర్గాన్ని మరియొకవర్గం పైకి యుద్ధానికి నడిపింపవలసినప్పుడు ఒక నేత కావలసివచ్చాడు. ఈ నాయకుడు సాధారణంగా ఆజాతిలో వృద్ధుడే అవుతుండినాడు. ఆయనను అప్పుడు కులపతి అనిపిలిచేవారు. ముసలివానికి మంచి అనుభవము, మంచిజ్ఞానం వుంటుంది గదా! ఈ కులపతికి వర్గంలోని యితరప్రజకు ఏమంత భేదం వుండలేదు. ఆయనగూడ తెగవారందరితోబాటు పనిజేసేవాడు; ఉత్పత్తిఅయిన ఆహార పదార్థమునంతా తెగవారందరు పంచుకొనేవారు. ప్రతిది జాతిసమష్టికి జెందినదే. ఇప్పుడు మనకున్నట్లు ప్రతిఒక్కరికి ప్రత్యేకంగా ఆస్తి, యిల్లు మొదలైన యితరములెన్నో ఆనాడులేవు.. ఎవరేమి సంపాదించినా, అది వర్గమునకు జెందినట్లే అందరూ విభాగించుకొనేవారు. కులపతి లేక వర్గపాలకుడు యీపనినంతా చేస్తుండేవాడు.

కాని, మెల్లిగా ఎన్నోమార్పులు వచ్చినవి. క్రొత్త పనులు, ముఖ్యంగా వ్యవసాయంవల్ల ఏర్పడినవి. అప్పుడు కులపతి వారివారికి ఆయాపనుల నిర్ణయిస్తూ, వర్గంలోని ప్రతివ్యక్తి తమతమ పనులబాగా నెరవేర్చినాడాలేదా అనిచూచుకొనేవాడు. దీనితో ఆయన పొద్దుకాస్తా సరిపొయ్యేది. క్రమేణా కులపతి సామాన్యులు చేసేపనినుండి విర

మించుకొంటూ వచ్చినాడు. ఇలా క్రమేణ యీయన వర్గ సామాన్యజనానికంటె వేరై పోయినాడు. ఇప్పుడు మరియొక కృషివిభాగం యేర్పడింది. కులపతి నిర్మాణకార్యాన్ని జేస్తూ ప్రజల ఆజ్ఞాపిస్తుంటే, యితర ప్రజలు పొలాలలో పనిజేసి, వేటాడి, యుద్ధాలు చేసి, తమనాయకుడైన, తమకుల గురువు ఆజ్ఞల తౌదలదాల్చి పాలిస్తుండినారు. రెండు తెగలమధ్య యుద్ధంపర్పడిందా! కులపతిఅధికారంయిబ్బడి అయిపోయేది; ఎందుకంటే-యుద్ధసమయంలో నాయకుడు లేనిదే పోరు బాగా సాగదు. అందువల్ల కులపతి అత్యంతం శక్తియుతుడై పోయినాడు.

నిర్మాణకార్యకలాపాలు విస్తరిల్లేకొంది, ఒక్క కులపతే దీనినంతా నెరవేర్చలేకపోయినాడు. ఇందు తన తోడ్పాటుకుగా ఇతరులను ఏరుకొన్నాడు. ఇలా నిర్మాణాధి కారుల సంఖ్య పెరిగిపోయింది కాని, కులపతే యిందు ప్రధానుడై వుండినాడు. అప్పుడు వర్గంలో నిర్మాణాధికారులు, సామాన్యకర్మకారులు అని రెండుచీలికలు కలిగినవి. ఇక అప్పుడు పురుషులలో సమతపోయింది. హెచ్చు, తక్కువలు ఏర్పడినవి. నాయకులైనవారు శక్తియుతులై అనుయాయు లైన సామాన్యులపై అధికారముల నెరపుచుండినారు.

ఆర్వాత, కులపతిత్వం ఎలా ఎదిగింది ముందు వృత్తాంతంలో చూస్తాం.



# 16. కులపతి - అతని అధికారాభివృద్ధి

పురాతన జాతులు, కులపతులను గురించిన నా వివరణము నీకు నిస్సారంగా కన్పించదనుకొంటా. ఆ దినాలలో ప్రతిది తెగకు సంబంధించే వుండేదిగాని, వ్యక్తుల సొంతానికి చెందివుండలేదని గత లేఖలో చెప్పివున్నా. కులపతిది అని ప్రత్యేకంగా ఏదీ లేదు. వర్గంలో ఒకసభ్యుడుగా యితరులందరివలెనే ఆయనకు ఒక భాగంమాత్రం వుండేది. కాని; ఆయన కార్యప్రణాళిక నిర్మాతగా-కార్యదర్శిగా, జాతిమొత్తపు ఆస్తిని, వస్తుచయాన్ని పాలించి రక్షించువాడుగా భావింపబడు చుండినాడు. ఆయన అధికారం ఎదిగినకొలది, యీ ఆస్తి, వస్తువులు జాతిదిగాక, సర్వము నిజంగా తన సొంతానిదే అని భావింప సాగినాడు. ఇంకొక విధంగా ఆ జాతికి తానే నాయకుడు కాబట్టి, తానే జాతి అనుకొన్నాడు. చూచినావుగదా! సొంతఆస్తి అనే అభిప్రాయం ఎలా ప్రారంభమైందో? ఇక యిప్పుడు, ఇది నాది - అది నీది అనే మనం యోచిస్తున్నాము - మాట్లాడుతున్నాము. కాని, నేను చెప్పియుండినట్లు, ఆదిమవర్గ స్త్రీ పురుషులెవరుగాని యీరీతిగా భావించి ఎరుగరు. అప్పుడు సర్వసంపద జాతిదే!

అయినప్పటికిని, ప్రాచీన కులపతి, తానే జాతి అని ఎన్నుకొంటూ, ఆ వర్గానికి సంబంధించిన, హెచ్చు తక్కువ సర్వవస్తుచయాన్ని - సంపదను, తనవేనని చూడసాగినాడు.

ఒక కులపతి మరణించగానే, గూడెమువారంతా చేరి, ఇంకొకరిని తమనాయకుడుగా - కులపతిగా ఎన్నుకొనే

వారు. ఇతరులకంటె సాధారణముగా కులపతి వంశీకులకే, కార్యనిర్వహణ విధానము - భారము ఎక్కువగా తెలిసి



భూరిసత్వము (పునర్నిర్మితము). ఈ జాతి ఏనుగు అంతరించిపోయినది.

యుండినది. వాళ్లు ఎప్పుడును కులపతితో గూడానే వుండుట

చేత, ఆయనకు పనిలో అండగావుండి, చేదోడు వాదోడు అవుతూ, పనిలో అనుభవాన్ని గడించుకొన్నారు. కాబట్టే, ఒకముసలి కులపతి గతించగానే, జాతివారంతా, అదేకుటుంబానికి జెందిన మరియొకనినే కులపతిగా వరించడం సంభవిస్తూవచ్చింది. ఇలా, యితరులనుండి కులపతి కుటుంబము బాగా వేరైపోయినందున, వర్గం యీ కుటుంబీకులనుండే తమ నాయకుని ఎన్నుకొంటూ రావడం మనకు కన్పిస్తుంది. ఇప్పటికి కులపతి అధికారం చాలా ఎదిగిపోయినది. తన తర్వాత, తన కొడుకునో, తమ్మునో కులపతిగా అతడు చేయగోరుతా డనడం సహజమేగదా! ఇక దీనికై తన సాయశక్తులా ప్రయత్నించేవాడు. ఇది మనస్సులో బెట్టుకొనే, తనకొడుకునో, తమ్ముడో, లేక మరియే దగ్గరిచుట్టమునో కులపతి అయ్యేదానికి దిద్ది తీర్చుచుండినాడు. ఇంతేగాకుండా, తాను నిర్ణయించి శిక్షణమిచ్చిన ఏదో ఒకవ్యక్తినే తన తదనంతరం కులపతిగా చేయాలని తన సముదాయంతో చెప్పను గూడ చెప్పేవాడు. బహుశా, మొదట మొదట, యిలా ఆదేశింపబడటం గూడెంవారికి నచ్చివుండదు; కాని వెంటనే వారు దీనికి అలవాటుబడిపోయి, కులపతి చెప్పినట్లే సదా నడచుకొంటుండినారు. వాడుకలో, ఏనాడుగాని యిట్టివారిని కాదని కొత్త కులపతిని ఎన్నుకొన్నదిలేదు. ఆ ముసలి, తన వారసు ఎవడో, ఎన్నడో నిర్ణయించుకొన్నాడు కాబట్టి, అదే విధంగా ఆ మనిషి కులపతి అయ్యేవాడు.

ఈ విధంగా, కులపతిత్వం వంశానుగతికం కావడం మనకు తెలుస్తున్నది. అంటే - అది ఒకే కుటుంబాన్ని

అంటిపెట్టుకొని, తండ్రినుండి కొడుకుకు, లేదా మరియొక ఆత్మబంధువుకు సంక్రమిస్తూ వచ్చింది. ఇప్పుడు, తెగకు చెందిన సంపద, వస్తుచయము, సర్వం వ్యవహారికంగా తనసొంతాలే అని కులపతి బాగా అనుకోగలిగినాడు. తాను చనిపోయినతర్వాతకూడ అవి తన కుటుంబాన్ని విడిచి బయటపోలేదు. ఇప్పుడు నాది - నీది అనేభావన ఎలా రూపొందిందో మనకు గోచరిస్తున్నది. మానవాగమన ప్రారంభంలో యీ అభిప్రాయమే లేదు. ప్రజలందరూ తెగకొరకు పాటుబడేవారే గాని, వ్యక్తిలాభానికి శ్రమించి ఎరుగరు. అందరు కలసి, ఆహారంగాని, మరి యేయితర పదార్థంగాని ఉత్పత్తిచేసినచో వర్గమువారందరు పంచుకొనేవారు. కలిమి లేములు తెగలో లేవు. జాతిసమష్టి భాగ్యానికి వారందరూ భాగస్వాములే!

కాని, తెగకు సంబంధించిన ఆస్తిని కులపతి జవురుకొని, తనది అనను ప్రారంభించగానే, దానివెనువెంటనే కలిగినవారు - లేనివారు, ధనికులు - బీదలు అనే విభాగం ఏర్పడ జొచ్చింది.

దీన్నిగురించి, ఇంకకొంత ముందుజాబులో చెప్పవలసి వున్నది.



# 17. కులపతి రాజైనాడు

ఈ ముసలి కులపతి మనకాలాన్ని చాలా వ్రయింప జేసినాడుకదూ? ఆయనప్రసక్తి నిక్కడే ముగించుదాం; కాదు కాదు, ఆయన పేరు మారుస్తాం! రాజులంటే ఎవరో, రాచరికాలు ఎలా పుట్టినవో నీకు చెబుదామని మొదట యీ కథనం ప్రారంభించాను. రాజులసంగతి అర్థంకావాలంటే వెనుకకు కులపతులనే ప్యాట్రియార్కుల కతవరకు పోవలసి వున్నది. ఈ కులపతులే క్రమేణా రాజులు, మహారాజులు అయినారని నీవు వూహించుకొనే వుంటావు. 'ప్యాట్రియార్క' అనేపదం ల్యాటిన్ భాషలో పిటర్ (=తండ్రి) శబ్దతద్భవము. అతడు తన తెగకు, ప్రజకు నాయకుడు-జనకుడుగా వుండినాడు. పితృభూమి అనే ప్యాట్రియా పదము అదే ల్యాటిన్ మూలంనుండి పుట్టింది. దీనినే ఫ్రెంచిభాషలో ప్యాట్రి అనడం నీకు తెలుసుగదా! సంస్కృతము, ఇంకా యితర హైందవభాషలలో, మనదేశాన్ని తల్లిగా, తల్లినాడుగా (మాతృదేశంగా) భావిస్తాం. వీటిలో నీకేది నచ్చింది?

కులపతిస్థానం పరంపరానుగతం, అంటే - తండ్రికి వారసు కొడుకైనప్పుడు, అతనికి రాజుకు అట్టే భేదం లేకుండా పోయింది. అతడే రాజుగా మారినాడు. ఇక, అప్పుడు, ఆ రాజు దేశము - దేశంలో వున్న సర్వస్వము తనదే ననుకొనే వింతభావాన్ని పొందినాడు. అతడే దేశ మనుకొన్నాడు.

వెనుకటికి, ఒక ప్రఖ్యాత ఫ్రెంచిరాజు 'నేనే దేశం : దేశమే నేను' అని చాటినాడు. దేశం పండించిన ఆహారం మొదలైన సంపదనంతా ప్రజలమధ్య పంచిపెట్టి, సంఘ నిర్మాణంకొరకే ప్రజలు తమ్ము నియమించినారన్న అసలు సంగతినే యీరాజులు మరచిపోయినారు. దేశంలోని జాతి ప్రజలందరికంటె వారు ఎక్కువ తెలివైనవారు, అనుభవంకలిగినవారు అన్న వూహతోనే తమ్ము నాయకులుగా ఎన్నుకొన్నారన్న సత్యాన్నిగూడ మరచిపోయినారు. తామే యజమానులని, దేశంలోవున్న జనమంతా తమ సేవకాగణమని కల్పించుకొన్నారు; కాని, నిజానికి వారు దేశసేవకులే!

ముందుముందు, నీవు చరిత్రచదివితే, రాజు లెంత అహంకార దర్పాల పెంచుకొని, తమ్ము ఎన్నుకొనేదానికి ప్రజలకే హక్కు లేదని అనుకొన్నారో నీకు తెలుస్తుంది. తమ్ము రాజులుగా చేసింది దేవుడేనని, తాము దైవాంశసంభూతుల మని చాటినారు. దీన్నే వాళ్లు 'రాజుల దైవాధికార' మన్నారు. వాళ్లు యిలా చాలాకాలం చెడ్డత్రోవలో అవినీతికరంగా ప్రవర్తించి, తమప్రజలు ఆకట మలమలమాడుతుంటే, తాము భోగలాలసత్వంలో, ఆడంబర వైభవంతో కాలం గడిపేవారు. కాని, చివరకు యీ అన్యాయాన్ని సామాన్యప్రజలు ఏమాత్రంగాని సహించుకోలేకపోయినారు. కొన్ని దేశాలలో వీండ్లు తమరాజులనే తరిమివేసినారు. ఇంగ్లండు ప్రజలు తమరాజు–మొదటిఛార్లెస్–పై తిరుగుబాటుజేసి, చివరకు అతనిని చంపనుగూడ చంపినారు; పరాసు ప్రజలు ఒక ప్రచండవిప్లవాన్ని సాగించి,

తమకు రాజులు అవసరంలేదని తీర్మానించుకొన్నారు. ఇదంతా నీవు ముందుముందు చదువుతావు. ప్యారి నగరంలో కాక్‌ని గరి చెరసాలను మనం చూచింది జ్ఞాపకం తెచ్చుకో! అప్పుడు నీవు మాతోగూడ రాలేదా? ఈ చెరసాలలోనే రాజును, రాణి-మేరి ఆన్‌ట్వాయ్‌నెట్‌ను, ఇంకా యితరులను బంధించి పెట్టినారు. ఈమధ్యనే, కొన్నిఏండ్ల క్రితం, రష్యాప్రజలు తిరుగబడి, జార్ అనబడే తమరాజును తరుమగొట్టిన ఆగొప్ప రష్యావిప్లవచరితను గూడ నీవు చదువబోతావు.

రాజులు తమ భాగవతాల ఆడి, అంతరించి పోయి నారు. ఇప్పుడు చాలా దేశాలకు రాజులే లేరు. ఫ్రాంసు, జర్మనీ, రష్యా, స్విడ్‌జెర్‌ల్యాండ్, అమెరికా రాజ్యాలు, చైనా ఇంకా చాలాచాలా దేశాలకు రాజులు లేరు. అవి ప్రజాస్వామిక రాజ్యాలు. అంటే—ప్రజలే అప్పుడప్పుడు తమ పాలకులను, నాయకులను ఎన్నుకొంటారు. వీరి పద వులు వంశానుగతికాలు కావు.

ఇంగ్లండులో, ఇంకా రాజున్నసంగతి నీకు తెలుసును గదా! కాని, ఆయనకు అధికారమే లేదు; ఆయన చేయ గలిగింది బహుస్వల్పము; సమస్తఅధికారము ప్రజాప్రాతి నిధ్యంవహించిన ప్రజానాయకులసభ-పార్లమెంటు-హస్త గతమై వున్నది. లండనులో నీవు పార్లమెంటు భవనాన్ని చూచిన సంగతి జ్ఞాపకం తెచ్చుకో.

మనదేశంలోనో - ఇంకా ఎందరో రాజులు, మహా రాజులు, నవాబులు వున్నారు. మంచిమంచి దుస్తులతో, చాలావిలువైన మోటారుకారులలో వూరేగుతూ, తమ

సొంతానికి విశేషధనాన్ని వ్యయిస్తూ వున్నారు. ఈడబ్బంతా వీరికి ఎక్కడనుండి వస్తున్నది? దీనిని ప్రజలనుండి శిస్తు మూలకంగా దండుతున్నారు. ఈ పన్నులద్రవ్యము తిరిగి దేశసౌభాగ్యానికిగా వెచ్చించబడునసే ప్రజలు వీటిని చెల్లిస్తున్నారు. ఈధనం ప్రజానీకమునకు విద్య, వైద్యం, రహదారులు, గ్రంథాలయాలు మొదలైనవి ఎన్నో ఉపయుక్త అంశాలను సమకూర్చవలసి వుంటుంది. కాని, మన రాజులు మహారాజులు, ఇంకా ఆపాత ఫ్రెంచిరాజువలెనే 'తామే దేశం; దేశమే తాము' అని అనుకొంటున్నారు. అట్లనుకొని ప్రజలడబ్బంతా స్వప్రయోజనాలకు, భోగాలకు అమితంగా వెచ్చిస్తున్నారు. ఈ పాలకులు యిలా భోగైశ్వర్యాలలో ఓలలాడుతుంటే, చమటోడ్చికష్టించి వీరికి ధనాన్నికూర్చి పెట్టే వీరి ప్రజలు మాత్రం ఆకటమాడి, పేలికలతో వున్నారు. వారి బిడ్డలకు చదువునేర్పను బడులే లేవు.



# 18. ఆదిమ నాగరకత

కులపతులను, రాజులను గురించి చెప్పినంతవరకు యిప్పటికి చాలును. ఇక, కాస్త వెనుకకుపోయి, ఆదిమ నాగరకతను గురించి, ఆదినాలలో నివసిస్తుండిన జనులను గురించి విచారిస్తాం.

ఈ ఆదిమ ప్రజలను గురించి, మన కంత బాగా తెలియదుగాని, పురాణ-నవ్య పాషాణయుగ జనులను గూర్చి తెలిసినదానికంటె ఎక్కువగా మాత్రం వీరిని గురించి మనకు తెలుస్తున్నది. అనేకవేల సంవత్సరాలకు ముందు నిర్మింపబడిన భూరిభవనాలు ఎన్నో, శిథిలమౌతూ ఇంకా యిప్పటికిగూడ నిలబడివున్నవి. ఈ సౌధాలను, యీ దేవాలయాలను, యీ రాజహర్మ్యాలను చూస్తే, నాగరికత ప్రారంభ సమయములో వెలసిన ఆ ప్రజలు ఎలా వుండినది, వారు ఏమిచేసింది మనము కొంత వూహించుకో గలుగుతున్నాము. ముఖ్యంగా యీ ప్రాచీనకట్టడాలలో మలిచివున్న శిల్పచిత్రాలు, చెక్కడాలు మనకు చాలా వుపయోగకరములుగా వున్నవి. ఈ చిత్రాలు-ప్రతిమలనుండి, ఒక్కొక్కప్పుడు, వారు ధరిస్తుండిన వుడుపులు, ఇంకా, యితర అంశాలు చాలా మనం కనుగొనగలుగుతున్నాము.

మొట్టమొదట, మానవుడు ఎక్కడ స్థిరనివాస మేర్పరచుకొని, నాగరకతను పెంపొందజేసుకొన్నాడో మనం

నిష్కర్షగా చెప్పలేము. అట్లాంటిక్ మహాసముద్రంలో, ఇప్పుడు అట్లాంటిస్ అనే దేశం పూర్వం చాలా గొప్పగా వుండింది అని కొందరంటారు. ఈ దేశంలో మానవులు నివసించి, నాగరకతా శిఖరానికి ఎక్కిపోయినారని అంటారు. కాని, ఎలానో ఆ దేశాన్నంతా అట్లాంటిక్ మహాసముద్రం దిగమ్రింగి వేసింది. దీనికి తార్కాణాలు ఏమీ లేవుగాని, కట్టుకతలు మాత్రం మిగిలివున్నవి. కాబట్టి దీనిని మనం వదలివేయవచ్చు.

ఇంకా మరికొందరు, ఎన్నడో - చాలా కాలానికి ముందు, అమెరికాలో మహిమోన్నతమైన చాలా నాగరకతలు వెలసివుండినవి అని చెబుతారు. కొలంబస్ అమెరికాను కనిపెట్టినాడని అనుకోవడం నీకు తెలిసినసంగతే గదా! అంటే, దీని అర్థం-కొలంబస్ రాకకు ముందు ఆ దేశం అక్కడ లేదని కాదు; కొలంబస్ ఆ దేశంలో దిగి, అందరికి తెలియపరచేవరకు యూరపువాసులకు దానిసంగతి తెలియదన్నమాట. కొలంబస్* ఆ దేశం చేరడానికి ముందు, ఎంతో కాలంనుంచి అచట మానవులు నివసిస్తూ ఒకవిధమైన నాగరకులుగానె వుండినారు. ఉత్తర అమెరికాలో మెక్సికో దేశమందు యుకటన్ అనేచోట, ఇంకా, దక్షిణ అమెరి

---

*కొలంబస్ వెస్టుయిండీసు దీవులనుమాత్రమే తాకినాడు. కాని, 1499లో బ్రెజిల్‌లో దిగిన అమెరిగో వెస్‌పుచి అనే ఇటలీ వర్తకుడు అసలు ఖండమును చూచినవాడు. ఇతనిపేరనే ఆదేశానికి అమెరికా నామం వచ్చింది. —అనువాదకుడు.

కాలో పెరు రాష్ట్రింలోను అనేక పురాణ భవన శిథిలాలు మనకు గాన్పిస్తున్నవి. దీనినిబట్టి, ప్రాచీనకాలంలో పెరు, యుకటనులలో నాగరకులైన జాతులు నివసిస్తుండినవని మనం రూఢిగా చెప్పవచ్చును. కాని, ప్రస్తుతం మనకంతగా తెలియదు కాబట్టి వారిని గురించి విశేషంగా చెప్పలేము. బహుశా పోనుపోను చాలా క్రొత్తసంగతులు వారినిగురించి బయటబడునేమో!

యూరేషియాలో - యూరపు, యేషియా ఖండాల సంయుక్తనామము - పురాతన నాగరకతలు మెసాపొటామియా, ఈజిప్ట్, క్రీట్, హిందూదేశము, చైనాలలో అల రారినవి. ఈజిప్ట్ ఆఫ్రికాఖండంలో వుండినా, మనకు దగ్గర కాబట్టి, యూరేషియాలో వున్నదనుకొందాం.

ఎప్పుడూ తిరుగాడే పాతతెగలు ఒకచోట నిలిచి పోవాలంటే, ఎటువంటి ప్రదేశాన్ని ఏరుకొంటవి? వారికి ఆహారం సులభంగా లభించే స్థలాలుగా వుండవలెగదా! వారి తిండి, కొంత, వ్యవసాయ మూలకంగా ఉత్పత్తి చేయబడేది. సేద్యానికి నీరు అత్యంతావసరం. నీళ్లు లేకుంటే చేలుఅంతా ఎండిపోయి, అందు ఏమీ మొలవదు. మన దేశంలో ఋతుపవనాలు సరిగాలేక అదునుకు చాలి నంత వాన కురియకపోతే ఆహారం తగినంత ఫలించక కాటకాలు రావడం నీకు తెలిసేవున్నది. ఆ దినాలలో పేదలు తిండి దొరకక మాడేవారు; నీరే ప్రాణాధారం. అందువల్ల, నీళ్లుసమృద్ధిగాదొరకే చోటులుండే ఆదిమవాసులు తమవలసలు ఏర్పరచుకొని వుంటారు. ఇది నిజమేనని యిప్పుడు తేలింది.

మెసొపొటామియాలో*, టిగ్రిస్-యుఫ్రేటిస్ అను



ఇగొనోడన్ - అను లుప్తమైన మరియొక కీటకము
భూమినుండి భుజాలకు 10 అడుగుల ఎత్తు.

* నేటి యిరాక్—అనువాదకుడు.

రెండు మహానదులమధ్య అధినివేశాల ఏర్పరచుకొన్నారు. ఈజిప్ట్‌లో బ్రహ్మాండమైన నైలుస్రవంతిప్రాపున చేరినారు. హిందూస్థానంలో హెచ్చుతక్కువ, వారి పట్టణాలన్నీ పెద్ద నదులు - సింధు, గంగ, యమునల దరులదగ్గరనే నిర్మింపబడినవి. వారికి నీటి అవసరం ఎంత ప్రాధాన్యమైనదంటే - వారికి అన్నము, సిరి, సంపదల నిచ్చిన యీనదులు పవిత్రాలు, పూజనీయాలు అయినవి. ఇజిప్షియనులు నైలును తండ్రి అని ఆరాధించినారు. మనదేశంలో గంగానది పూర్వంనుండి నేటివరకు పునీతమని కొలువబడుతున్న సంగతి నీ వెరుగుదువు. ఈ పుణ్యనదిని గంగమ్మతల్లి (గంగామాయి) అని సేవిస్తూ, యాత్రికులు 'గంగామాయికి జై' నినాదాలు చేయడం సాధారణం. ఈ నదులే వారి సర్వస్వమై, వారి జీవనాధారాలు కావడంవల్ల యీ పూజలు మనకు బాగా అర్థం అవుతున్నవి. అవి కమ్మటినీళ్లనే గాక, వారిభూముల కండపరచి, సారవంతాలుగా జేసే యిసుకను, ఒండుమట్టిని గూడ ప్రసాదించినవి. ఈ బురద, యీ ఏటినీళ్లు—వీటి మూలాన నేల మంచిపంటను యిచ్చింది. కాబట్టి నదులను తండ్రి - తల్లి అనడం సముచితంగానే వున్నది. కాని, ఒక పని ఎందుకు తాము చేస్తున్నారో ఆ సంగతి మరచిపోవడం ప్రజలకు పరిపాటి. అనుకోకుండానే యితరులను అనుకరిస్తూ పోతుంటారు. నైల్, గంగలు ప్రజలకు ఆహార పానీయాల నొసంగుటచేత పునీతాలుగా పరిగణింపబడుతున్నవని మనం జ్ఞాపకముంచుకోవలెను.



# 19. ప్రాచీనప్రపంచ ప్రసిద్ధనగరాలు

ప్రజలు మొదట, సత్తువగలిగిన లోయలలో, పెద్ద నదీతీరాలలో, తిండి నీరు సమృద్ధిగా లభించే చోటులందు స్థిరవాసాలు యేర్పరచుకొన్నారని తెలుసుకొన్నాం. వారి పెద్దపెద్ద పట్టణాలన్నీ ఏటిఒడ్డులమీదనే వుండినవి. ఈ పురాతన విశ్రుత పట్టణాలపేర్లు కొన్ని నీవు వినేవుంటావు. బ్యాబిలాన్, నినివె, అస్సుర్ నగరాలు మెసొపొటామియాలోనివి. కాని, అవి యిప్పుడు లేవు; ఎప్పుడో అంతరించిపోయినవి. ఆ ప్రదేశాలలో లోతుగా త్రవ్వితే యిసుకలోనో, మట్టిలోనో కూరుకొనిపోయియుండిన ఆనగర అవశిష్టచిహ్నాలు అప్పుడప్పుడు బయటపడుతుంటవి. గతించిపోయిన యీ అనేకవేల సంవత్సరాలలో, అవి దుమ్ము మట్టి యిసుకలో పూడిపోయి, బొత్తుగా వాటి ఆనవాలే లేకుండాపోయినవి. ఇలా భూగర్భంలో కృంగిపోయిన పాతపట్టణాలమీదనే, కొన్నిచోట్ల కొత్తపట్టణాలు లేచినవి. ఈజీర్ణపట్టణాలకొఱకు వెదకేవారు చాల లోతు త్రవ్వవలసివచ్చింది. ఒక్కొక్కప్పుడు ఒకపట్టణంమీద ఇంకొకపట్టణం కట్టబడి, రెండూ నాశనమైపోయినవి చాలాప్రదేశాలలో గాన్పించినవి. అవి రెండూ ఓకేసారి తోడుతోడుగా జీవించియుండలేవులే! బహుశా, ఒకపట్టణం చాలావందలేండ్లు వుండి వుంటుంది; అందు ప్రజలు జీవించి మృతులై వుంటారు; ఇట్లే వారి బిడ్డలు - బిడ్డల బిడ్డలు పుట్టి, గిట్టి వుంటారు. క్రమక్రమంగా

ఆపట్టణం పాతబడి, పరిత్యక్తమౌతూ వచ్చివుంటుంది; రాను రాను ప్రజలు తగ్గిపోయి చివరకు ఎవరూ లేకుండా పోయి వుంటారు; ఆ తర్వాత ఆ ప్రదేశమంతా పాడుపడి దిబ్బలై పోయింది. ఇసుక మట్టి కొట్టుకొనివచ్చి, ఆ నగరాల క్రమ్మివేసినవి; దీనిని త్రవ్వి బాగుచేసే దిక్కే లేకపోయింది. అవతల చాలా చాలా ఏండ్లు గడచిపోగా, ఆ పట్టణమంతా మట్టి, యిసుకలక్రింద పూడిపోయింది; ప్రజలు అక్కడ ఒక పట్టణం వుండినదన్న సంగతే మరచిపోయినారు. ఇలా కొన్ని వందలేండ్లు గడచిపోయి వుండవలె; అవతల కొత్తజనం వచ్చి, ఆచోట ఇంకొక కొత్తపట్టణాన్ని నిర్మించినారు. ఈ కొత్త పట్టణంగూడ కాలక్రమేణా పాడుపడిపోయింది. అదిగూడ, కాలగర్భంలో దుమ్ము, యిసుకలక్రింద మూసి, అంతరించి పోయింది. కాబట్టే, మనకు ఒకపట్టణ శిథిలాలమీద ఇంకొక నగరజీర్ణాలు కాన్పిస్తున్నవి. ఇసుక త్వరగా ప్రతిదాన్ని పూడ్చివేస్తుంది కాబట్టి, యీస్థితి ముఖ్యంగా యిసుక ఎడారి ప్రదేశాలలో సంభవించింది.

ఒకపట్టణం తర్వాత మరియొకపట్టణం తలయెత్తి, ఆ బాలగోపాలానికి ఆశ్రయమిచ్చి, మెల్లిగా జీర్ణించి జీర్ణించి, ఖిలమై పోవడం నిజంగా, వింతైనవిషయము! ఆ తర్వాత ఆ పాతపట్టణాల మీద కొత్తవి లేచి, కొత్త జన సమూహం వచ్చి అందు నివసిస్తారు. వారూ అంతరించి అందు వారిచిహ్నాల ఏమీ వదలకుండానే పోతారు. ఈ పట్టణాలవిషయం నేను కొన్ని వాక్యాలలోనే

వ్రాసివేసినా. కాని, యీపట్టణాలు పుట్టి, పెరిగి, విరిగిపోను, ఆ తర్వాత, వాటి స్థానే మరికొన్ని కొత్తపట్టణాలు రూపొందను ఎన్ని వేనకువేలు సంవత్సరాలు పట్టినవో వూహించుకో! ఒకమనిషికి డెబ్బై, యనభై ఏండ్లురాగానే ముసలివాడంటాము. కాని, యీ అనేక సహస్రసవత్సరపర్యంత దీర్ఘ కాలంలో యీ పసులెంత? ఈ పట్టణాల జీవితయాత్రలో ఎందరు శిశువులు వృద్ధులై మరణించి, మరల ఎన్నిమారులు చరిత్ర చర్వణులై యుంటారో! ఇక యిప్పుడు బ్యాబిలాన్, నినెవె నగరాలు మనకు నామమాత్రావశిష్టాలు.

ఇంకొక అతిప్రాచీనగరం సిరియాలోని డమాస్కస్. కాని, డమాస్కస్ యింకను చావలేదు; ఇది యింకను సజీవంగా, భూరిపట్టణంగా అలరారుచున్నది. డమాస్కస్ నేను, ప్రపంచపట్టణాలలోకెల్ల అతి ప్రాచీనతమమైంది అని కొందరంటారు. భారతదేశంలో, మన పెద్దపెద్ద పట్టణాలన్నీ నదీతీరాలలో వున్నవి. చాలా ప్రాచీనమైంది ఇంద్రప్రస్థము. ఇది నేటి ఢిల్లీసమీపంలో ఎక్కడనో వుండింది; కాని ఇంద్రప్రస్థము యిప్పుడు లేదు. వారణాసి (బెనారస్) లేక కాశి గూడ మనివున్న ప్రపంచపురాతన పట్టణాలలో ఒకటిగావుండవచ్చును. అలహాబాదు, కాన్పూరు, పాట్న, ఇంకా నీవు చెప్పగలిగిన చాలా పట్టణాలుగూడ నదులఒడ్డులనే వున్నవి. కాని, యివి అంత పాతవిగావు. వీటిలో ప్రయాగ అనే అలహాబాదు, పాటలీపుత్రమని వ్యవహరింపబడుతుండిన పాట్నా నగరాలుమాత్రం ఒకపాటి పురాతనాలు. ఇలానే, చైనాలో గూడ బహుప్రాచీన పట్టణాలు ఉన్నవి.

---

# 20. ఈజిప్ట్-క్రీట్

పూర్వకాలంలో, యీపల్లెలలో పట్టణాలలో ఏవిధమైన మానవులు జీవించుచుండినారు ? వారు నిర్మించిన బ్రహ్మాండమైన భవనాలు యితర కట్టడాలమూలాన వారిని గురించి మనకు కొంత తెలుస్తున్నది. ఇంకా, వారు రాళ్ళ పలకలమీద మలిచియుంచి పోయిన వ్రాతలుగూడ కొంత సహాయకారు లౌతున్నవి. ఆతర్వాత, ఆ దినాలను గూర్చి చాలావిశేషాలను తెలిపే పురాతన గ్రంథాలు కొన్ని లభించి వున్నవి.

ఈజిప్ట్‌లో బ్రహ్మాండమైన పిరమిడులు, స్ఫిన్క్సు ప్రతిమ, లక్సర్‌నందలి భూరిదేవాలయ శిథిలాలు, ఇంకా యితరచోట్ల పలువిధ జీర్ణావశిష్టాలు నేటికిని నిలిచివున్నవి. మనం సూయజ్ కాలువగుండా ప్రయాణం చేసినప్పుడు, యివన్ని మనకు చేరువలో నున్నప్పటికిని నీవు చూడలేదు; కాని వాటి చిత్రాలను చూచివున్నావు. బహుశా వీటిని చిత్రించిన పోస్టుకార్డులు నీదగ్గర వున్నవేమో ! స్ఫిన్క్సుఅనేది స్త్రీముఖంకలిగిన సింహము. ఇది చాలా పెద్దది. అది ఎందుకు చేయబడింది? దాని అర్థమేమో? ఎవరికీ తెలియదు. ఆస్త్రీముఖంలో ఒక వింత, నిగూఢ, అస్ఫుట మందస్మితం అలరారుతున్నది. ఈ చిరునవ్వుకు కారణమేమో? అని, చూచినవారు ఆశ్చర్యపడుతారు. ఒకవ్యక్తి స్ఫిన్క్సువంటివాడు అంటే—ఆమనిషి యితరులకు అర్థంకాని సమస్య అని వాడుకలోకి వచ్చింది.

పిరమిడులుగూడ* కొండలనుపోలిన పెద్దకట్టడాలు. అసలు యివి ఫేరో అను నామకరణం గలిగిన పూర్వపు యీజిప్టు రాజుల సమాధులు. లండను బ్రిటీష్ మ్యూజియంలో ఇజిప్షియన్ మమ్మీలను చూచింది నీకు జ్ఞాపకంవున్నదా? మమ్మీ లంటే-కుళ్ళి చెడిపోకుండా చమురులు, మూలికలు, సుగంధద్రవ్యాల ప్రయోగంవల్ల కాపాడబడిన మానవ కళే బరాలు. ఇదే విధంగా జంతువులను గూడ చేసేవారు. ఫేరోలు చనిపోగానే, వారి శవాలు మమ్మీలుగా చేసి, యీ పెద్ద పిరమిడుల గర్భగృహాలలో పెట్టేవాళ్లు. మరణానంతరంగూడ మృతులు ఆహారాదికముల కోరుతారనే నమ్మకంతో ఇజిప్షియన్‌లు యీసమాధులలో, శవాలప్రక్కన సువర్ణ,రజతాభరణాలు, గృహోపకరణాలు, ఆహారాదికాలు వుంచేవారు. రెండుమూడేండ్లకుముందు†, యీపిరమిడులు ఒకదానిలో టూటెన్‌ఖామెన్ అను ఒక ఫేరో శవం కొందరు పరిశోధకులకు గాన్పించింది. ఆయన చుట్టు, ఎన్నో మనోజ్ఞ అమూల్య వస్తుసామాగ్రులు వుండినవి.

ఆదినాలలో, ఈజిప్టులోగూడ వ్యవసాయానికి నీటి పారుదలకు మంచికాలువలు మడుగులు త్రవ్వబడినవి.

---

*పిరమిడు నాలుగుపక్షాలుగా పైకి పోనుపోను మొనతేలి, అన్ని ముఖాలు కలుసుకొనిపోతవి. ఇవి బండలతో నైలుతీరాన నిర్మింపబడినవి. క్రీస్తుపూర్వం 3733లో కట్టిన గిజెపూ పిరమిడ్‌కు $2\frac{1}{2}$ టన్నుల బరువుగల మలిచినరాతిబండలు 25 లక్షలు పట్టినవట! ఈ రాయిఅంతా అరేబియానుండి తీసుకొని రాను, పదేండ్లుపట్టింది. నిర్మాణం 20 ఏండ్లు సాగింది. —అనువాదకుడు.

†1929 కి ముందు —అనువాదకుడు.

మెరిడు అనే విఖ్యాతమైన సరస్సు ముఖ్యంగా ఎన్నదగింది. ఇది, ఆ పురాతనకాలపు ఈజిప్షియనులు ఎంతనాగరకులై అభివృద్ధి జెందిన వివేకవంతులో తెలుపుతున్నది. ఇలా పెద్దపెద్ద కాలువలు, చెరువులు, పిరమిడ్లు నిర్మించను వారిలో నిపుణులైన మంచిఇంజనీరులు వుండివుండవలెగదా!

క్యాన్‌డియా అను నామాంతరం కలిగిన క్రీట్ అనే చిన్నదీవి మధ్యధరాసముద్రంలో వున్నది. పోర్టుసెయిడ్ నుండి వెనీసుకు పొయ్యేటప్పుడు మనం దారిలో దానికి దగ్గరగానే పోయినాము. పూర్వకాలంలో యీచిన్నదీవిలో ఒక అద్భుతమైన నాగరకత పెంపొందింది. అక్కడ నోసాస్ అనే ప్రదేశంలో ఒకబ్రహ్మాండమైన రాజప్రాసాదం వుంది; ఇంకా దాని శిథిలాలు వున్నవి. ఈ భవనంలో స్నానపుగదులు, రాతిగొట్టాలు వున్నవి; కొందరు అజ్ఞానులు వీటిని చూచి, యివన్నీ ఆధునికాలు అని అనుకొంటారు. ఇంకా-ఇక్కడ అందమైన కుండలు, శిల్పచాతురి, చిత్రలేఖనము, సున్నితమైన మేలురకపు లోహాలు, దంతములో జాణతనపు పనులు వున్నవి. ఈ క్షుద్రద్వీప రాజ్యంలో ప్రజలు ప్రశాంత జీవనాలగడపి, ఎంతో అభివృద్ధి జెందినారు. తాను తాకిందంతా బంగరమైనందున నానా అవస్థల పాలైన మిదాస్‌రాజుకథను నీవు చదివి వున్నావు. అతడు, పాపం! ఆహారమే బంగారైనందున ఏమీ తినలేక పోయినాడు; బంగారు ఆకలినేమి తీర్చగలదు? ఆయన తన పేరాస ఫలితాన్ని యిలా అనుభవించినాడు. అయితే, యిది మంచి చమత్కారకల్పనయేలే! ప్రజ లనుకొనేటట్లు

బంగారు అంత ఉపయుక్తమైన మంచివస్తువుకాదని చూప డమే యీ కథ వుద్దేశము.

క్రీట్‌కు సంబంధించింది ఇంకొక కథవున్నది. దానినీ నీవు చదివివుంటావు. అది మినోటార్ గాథ. ఇది సగంమనిషి, సగం ఆబోతుగా వుండినట్లు వూహింపబడుతున్న పెను భూతము. యువతీయువకులు యీ భయంకర వికృతజీవికి ఆహారంగా ఒసంగబడేవారట! అపరిచిత విషయికమైన భయంనుండే మతభావం మొట్టమొదట కలిగిందని యింతకు ముందే చెప్పివున్నాను గదా! ప్రకృతి రహస్యాల తెలుసుకోలేక, మన చుట్టు జరిగే విషయాల బాగాఅర్థంచేసుకోలేక పోయేదానికి తోడుగా, యీ భయంవల్ల ప్రజలు అనేక అవివేక కార్యాలు చేసేవారు. అసలు దయ్యాలే ఉన్నవని నేను అనుకోను; కాబట్టి, యథార్థభూతాలకేగాక, భ్రమజన్యమైన యిట్టి క్రూరసత్వాలకు గూడ బాలబాలికలను బలియిస్తుండే వారు. ఆ పూర్వదినాలలో, ప్రపంచ మందంతటా నరబలులనేవి సాగుతుండినవి. అంటే—ప్రజలు ఆరాధిస్తుండిన ఒక ఊహామాత్రజీవికి ప్రీతిగా స్త్రీ పురుషుల చంపి, అర్పించే వారు. ఈజిప్టులో, 'నైల్ తండ్రి'కి తృప్తి ఆనందాలు కలుగుననుకొని, ఆడపిల్లలను నైలునదిలో పార వేసేవారు. ఎక్కడనో, చాలా అరుదుగా, ఏ మారుమూలలనో దప్ప ప్రపంచంలో నేడు నరబలులు లేకపోవడం అదృష్టము! కాని, యిప్పటికిగూడ కొందరు, దేవునిమనసు మెప్పించను జంతువుల చంపి, నైవేద్యాల అర్పిస్తున్నారు. ఎవరి ఆరాధన అయితేనేమి? ఇది చాలా విచిత్రమైన పూజ!

# 21. చైనా - హిందూదేశము

ఆదిమనాగరకతలు మెసొపొటామియా, ఈజిప్ట్, మధ్యధరాసముద్రంలో వుండే క్రీటు అనే చిన్నదీవిలో పుట్టి పెరిగినవని తెలుసుకొన్నాం. అదే కాలానికి, చైనా హిందూ దేశాలలోగూడ, గొప్ప నాగరకతలు రూపొంది, తమతమ ప్రత్యేకమార్గాలలో బాగా పెంపొందినవి.

చైనాలో, యితర దేశాలలోవలెనే, పెద్దనదుల లోయలలో, సమప్రదేశాలలో ప్రజలు నివాసాలు ఏర్ప రచుకొన్నారు. వీరు మంగోలియా తెగవారు. వీరు కంచు లోహంతో అందచందాల పాత్రలు చేసి, వాడుకొంటూ, ఆ తర్వాత యినుమునుగూడ ఉపయోగపరచుకొన్నారు. నీటిపారుదల కాలువలు, అందమైన కట్టడాలు నిర్మింపబడి నవి. ఒక నూత్నవిధమైన లిపి, మారిమారి రూపొందింది; ఇది మన హిందీ, ఇంగ్లీషు, ఉరుదు వ్రాతలకు కేవలము భిన్న మైంది. అది ఒకవిధమైన బొమ్మలవ్రాత. ప్రతిపదము, ఒక్కొక్కప్పుడు చిన్నవాక్యముగూడ, ఒక బొమ్మరూపంలో వుండేది. ప్రాచీన ఈజిప్ట్, క్రీట్, బాబిలాన్ లలోగూడ యీ చిత్రలిపి వుండేది. ఈ వ్రాతను నీవు కొన్ని పుస్తకాలలో, పురాణవస్తు ప్రదర్శనాలలోను చూచివుందువు. ఈజిప్ట్‌లో, ఇంకా పశ్చిమదేశాలలో యీ లిపి చాలా పాతభవనాలలో మాత్రమే కాన్పిస్తున్నది. అక్కడ దీనిని ఏకాలంనాడో వుపయోగించినారుగాని, యీ మధ్య ఎప్పుడూ వాడుకలో

లేదు. కాని, చైనాలో యిప్పటికిగూడ వారి అక్షరాలు ఒక విధమైన చిత్రలిపిగా వున్నవి. ఇది, ఎడమనుండి కుడికి నడచే మన భాషలవలెగాక, కుడినుండి ఎడమకు వ్రాసే ఉరుదువలెగాక, పైనుండి క్రిందకు వ్రాయబడుతున్నది.

హిందూదేశంలో బహుశా ప్రాచీనభవన శిథిలాలు చాలామటుకు ఇంకా పాడుదిబ్బలు, యిసుక పర్రలక్రిందనే అణగిపోయి వున్నవేమో! ఎవరో ఒకరు త్రవ్వి, లేవదీసేదాక, అవి దాగి, మనకు కన్పించకుండానే వుంటున్నవి. కాని, ఉత్తరాన చాలాపురాతనమైన శిథిలాలు యిప్పటికే బయట బడివున్నవి. మంచి ఆధారాలు లేకపోయినా, ఆర్యులు హిందూదేశానికి వచ్చేదానికిముందు, చాలాచాలా కాలాకినిముందే, యిక్కడ ద్రావిడులు వుండినారు. వారి నాగరకత చాల ప్రశస్తమైనది. వారు విదేశాలవారితో వాణిజ్యం సాగించేవారు. వారిసామగ్రులను ఎన్నిటినో మెసొపొటామియా, ఈజిప్టులకు పంపించినారు. మనదేశంనుండి సముద్రాలు దాటిపోయిన వాటిలో బియ్యం, మిరియాలు మొదలైన సంబారద్రవ్యాలు, గృహనిర్మాణానికి టేకుకలప ముఖ్యములు. మెసొపొటామియాలో ఉర్ నగర ప్రాచీన భూరి సౌధాలు, రాజహర్మ్యాలు కొన్ని దక్షిణభారతదేశంనుండి ఎగుమతిచేయబడిన టేకుకొయ్యతో నిర్మింపబడినవని అంటారు. ఇంకా, బంగారము, ముత్యాలు, దంతము, నెమళ్లు కోతులుగూడ హిందూదేశంనుండి పశ్చిమ దేశాలకు పంపబడేవట! దీనివల్ల ఆ దినాలలో భారతదేశానికి యితర దేశాలతో వ్యాపారం విరివిగా సాగివుండవలెనని తేలు

చున్నది. ప్రజలు నాగరకులై వుంటేనే వ్యాపారం సాగను అవకాశం వుంటుంది. అప్పుడు, హిందూదేశంలోను, చైనాలోను చిన్నచిన్న రాజ్యాలు వుండినవి. ఈ దేశాలు రెండింటిలోగూడ ఏకఛత్రాధిపత్యం గలిగిన ప్రభుత్వాలు లేవు. ప్రతి చిన్నపట్టణంగూడ పరిసరభూములతో, అనుసరించి యుండిన గ్రామాలతో ప్రత్యేక ప్రభుత్వాన్ని కలిగివుండేది. వీటిని పట్టణరాజ్యాలన్నారు. ఆ ఆరంభదినాలలోగూడ యివి చాలావరకు ప్రజాస్వామ్యప్రభుత్వాలుగా వుండేవి. రాజులు లేరు. ఎన్నుకోబడిన పంచాయతులే రాజ్యాన్ని పాలించినవి. వీటిలో కొన్ని ఒకపాటి రాజ్యాలై వుండేవి. ప్రతి పట్టణరాజ్యంగూడ వేరై వుండినప్పటికిని, ఒక్కొక్కప్పుడు ఒకదానికొకటి సహాయపడుతూ వచ్చినవి. కొన్ని సమయాలలో, ఒక పెద్దప్రభుత్వం చాలా చిన్నచిన్నరాజ్యాలకు నాయకత్వం వహించేది.

చైనాలో, త్వరలోనే యీ చిన్నరాజ్యాలన్నీ పోయి, ఒక పెద్ద ప్రభుత్వం-ఒక సామ్రాజ్య రూపాన్ని పొందినవి. ఈసామ్రాజ్యం సాగిన దినాలలోనే చైనాలో ఒక పెద్దగోడ కట్టబడింది. ఈ భూరికుడ్యాన్ని గూర్చి నీవు చదివివున్నావులే! ఆహా! ఇది ఎంత గొప్పనిర్మాణం! ఎంతటి ప్రయత్నం! ఇతర మంగోలియా తెగలు చైనాలోకి దూరి, కల్లోలపరచకుండా చేయను యీగోడ సముద్రతీరంనుండి ఉత్తరాన ఉన్నతపర్వత శిఖరాలవరకు నిర్మింపబడింది. ఈగోడపొడవు 1400 మైళ్లు, వెడల్పు 25 అడుగులు, ఎత్తు 20-30 అడుగుల మధ్యవున్నది. మధ్యమధ్య దుర్గాలు, గోపురాలు వున్నవి.

ఇటువంటి గోడ నేగాని ఒకదానిని మనదేశంలో కట్టివుంటే, ఉత్తరాన లాహోరు మొదలు, దక్షిణాన చెన్నపట్నంవరకు



బ్రహ్మాండ కుడ్యము - చైనా

అది వ్యాపించి వుండివుంటుంది. ఈ పెద్దగోడ నేటికినీ వున్నది. చైనాకుపోతే దీన్ని నీవు చూడగలవు.

# 22. సముద్రయానము - వాణిజ్యము

పాతకాలంలో, మరియొక విచిత్రమైన జన సమూహం ఫొనీషియనులు. వారు యూదులు; అరబ్బుల తెగవారు. నేటి టర్కీ అయిన ఆసియామైనరు (చిన్నఆసియా) పశ్చిమ తీరం వారి ముఖ్యస్థావరం. వారి ప్రధానపట్టణములు ఏకర్, టైర్, సిడన్; ఇవి మధ్యధరాసముద్రపు ఒడ్డున వుండేవి. వారు వ్యాపారానికిగా దూరాబారపు సముద్రప్రయాణాలు చేసి పేర్గాంచినారు. వారు మధ్యధరా సముద్రాన్ని దాటి సరాసరి ఇంగ్లండు గడ్డనుగూడ తాకినారు. వారు భారత దేశానికి గూడ వచ్చివుందురు.

సముద్రయానం - వాణిజ్యం అనే రెండు అద్భుత విషయాలు యిప్పుడిప్పుడే ప్రారంభంకావడం చూస్తున్నాం. ఇవి ఒకదానికొకటి సహాయకారులైనవి. ఈ దినాలలోవలె పెద్దనావలు, మంచి పొగఓడలు అప్పుడు లేవు! చెట్టు బోదె తొలిచి, దోనెగా చేసుకొన్నవే మొదటమొదట పడవలుగా వుండివుంటవి. వీటిని తెడ్లతో నడిపి, ఆ తర్వాత గాలితాకిడిని గ్రహించను తెరచాపలు కనిపెట్టి, వాడుకలోకి దీసికొనివచ్చి వుంటారు. ఆ దినాలలో సముద్రయానం కడురమ్యంగా, ఉత్తేజకంగా, క్షోభాకరంగా వుండివుంటుంది. అరేబియాసముద్రాన్ని తెడ్లతో తెరచాపలతో ఒక పడవలో దాటటం వూహించుకో! దానిలో అటు ఇటు మెదలను చాలినంత చోటువుండదు; ఒక పిల్ల తెమ్మెర తాకుడుకే అది సుడితిరిగి, ఎగిరి, చాలాతరుచుగా మునిగిపొయ్యేది. దరిలేని

నీటిమీద యిటువంటి చిన్నపడవలలో ప్రయాణం చేయను ధైర్యశాలురు మాత్రమే సాహసించగలిగేవారు. నాటి ప్రయాణం ప్రమాదభరితం; ఒక్కొక్కప్పుడు నెలలపర్యంతం గట్టు కనిపించేదిగాదు. ఆహారపదార్థాలు అయిపోతే నట్టనడి సముద్రంలో ఏదీ దొరికేదికాదు; అప్పుడు చేపల పట్టో, పక్షులపట్టో ప్రాణాల నిలబెట్టుకొనేవారు. సముద్ర యానం సాహసికోద్యోగాలతో, రమ్యకథలతో నిండి వుండేది. ఆ దినాలకు సంబంధించినవి ఎన్నో నావికుల కథలు, విచిత్ర సంఘటనాలు యిప్పుడుగూడ కీర్తింపబడుతున్నవి.

అయితే మాత్రమేమి? ఈ అపాయాలను లెక్కచెట్ట కుండానే, సముద్రాలు దాటిపోయేవారు. కొందరు సాహసిక ప్రయత్నాలపై గల మోజుతో చేసివుంటారు; కాని, అధిక సంఖ్యాకులు మాత్రం ధనవ్యామోహంతో, బంగారుపై ఆశతో బయలుదేరి పోయివుంటారు. వారు వస్తువులను అమ్మి, కొత్తవి కొనను, అంటే - వ్యాపారానికిగా యానాలు సాగించినారు. కాబట్టే వారు ధనం సేకరించినారు.

వ్యాపార మంటే ఏమిటి? అది ఎలా ప్రారంభ మైంది? నేడు పెద్దపెద్ద అంగళ్లను చూస్తున్నావు. వాటి లోనికిపోయి, నీకు కావలసినవస్తువు కొనుక్కోవడం చాలాసులభమైనపని కాని, నీవు కొనేవస్తువులు ఎక్కడనుండి వస్తున్నవో ఎప్పుడైనా యోచించినావా? అలహాబాదులో ఒక అంగడిలో ఒకఉన్నిశాలువను కొనవచ్చును. ఆశాలువ కాశ్మీరమునుండి యింతదూరము వచ్చి వుండవచ్చు; దాని వున్ని కాశ్మీరము - లడాకు కొండలపైన మేసే గొర్రె

లపై పెరిగి వుండవచ్చును. నీవు కొనగలిగిన పలుదోము కుంచె అమెరికానుండి ఎంతోదూరం, రైలుమీద, ఓడల మీద ప్రయాణం చేసిచేసి, ఇక్కడికి చేరివుండవచ్చును. ఇట్లే చైనా, జపాను, ప్యారిస్, లండనులో చేయబడిన వస్తువుల కొనగలుగుతున్నావు. ఇక్కడ మన బజారులో అమ్మే ఒక విదేశవస్త్రపుపేలిక సంగతి యోచించు! పత్తి హిందూదేశంలో పుట్టి, ఇంగ్లండుకు ఎగుమతి చేయబడింది. ఒక పెద్ద కర్మాగారము దాన్ని దీసుకొని, శుభ్రపరచి, ఏకి, వడికి, ఆ తర్వాత గుడ్డగా నేస్తున్నది. ఆ గుడ్డ మరల మన దేశానికివచ్చి అమ్ముడుపోతున్నది. పుట్టి, వస్త్రమై, అమ్ముడు పోయేవరకు అటుఇటు అది ఎన్నివేల మైళ్ళు ప్రయాణం చేసింది! హిందూదేశంలో పండే దూది అంతదూరం ఇంగ్లండు మోసికొనిపోబడి, అక్కడ వస్త్రమై, తిరిగి, పోయినంతదూరం వెనుకకుమరలి రావడం చూస్తే, ఒక విధంగా అవివేకంగానే కాన్పిస్తున్నది. ఇదికాలహరణం, ధన శక్తుల వృథావ్యయం గదా! మనదేశంలోనే దూదిని బట్టలుగా నేస్తే అన్నివిధములా సౌకర్యమే కాకుండా, చౌక కూడా అవుతుంది. మనం విదేశవస్త్రంకొని వాడమని నీకు తెలుసును; మనం ఖద్దరు ధరిస్తాం. వీలున్నంత వరకు, మన దేశంలోనే వుత్పత్తిఅయిన వస్తువుల కొనడం చాలవరకు వివేకం. వడికి నేసే నిరుపేదలకు యిలా సహాయపడుతున్నా మన్న భావంతోగూడ మనం ఖద్దరుధారణ అవలంబించి వున్నాము. ఇప్పుడు, వ్యాపారం చాలా క్లిష్టవిషయమని నీకు తెలిసిపోయింది. పెద్దపెద్ద ఓడలు విధి విరామం లేకుండా,

ఒక దేశ వస్తుచయాన్ని ఇంకొక దేశానికి మోసికొని పోతున్నవి. కాని, ఇది ఎల్లప్పుడు జరిగిన పనిగాదు.

మొట్టమొదట, మానవుడు వలసలలో నిలిచిపోయిన ప్రాథమిక దినాలలో వ్యాపారం ఉన్నట్లు లేనట్లు వుండేది. మానవుడు తనకు కావలసిన సమస్తాన్ని, తాను స్వయంగా స్వీకరించుకోవడమో, స్వహస్తాలతో చేసుకోవడమో జరిగేది. అయితే, అప్పుడు అతడి కోరికలు, అవసరాలు అంతగా పెరిగివుండలేదులే! ఆ తర్వాత, ఇంతకుముందే చెప్పినట్లు, తెగలో కృషివిభాగం ఏర్పడింది. ప్రజలు వివిధవిధ కార్యాలను, భిన్నవస్తువులను చేసేవారు. కొన్ని సమయాలలో, ఒక తెగకు ఒకవస్తువు విశేషంగా లభించివుంటే, ఇంకొకవర్గానికి మరియొకవస్తువు అధికంగావుండడం సంభవించి వుంటుంది; ఇక అప్పుడు వారు వస్తువుల పరస్పరం మార్చుకోవడం సహజం. ఉదాహరణానికి – ఒక తెగ, ఒకధాన్యపుమూటకు బదులు ఒక ఆవును యివ్వవచ్చును. ఆకాలంలో డబ్బు లేదు. వస్తువులనుమాత్రమే మార్చుకోగలిగివుండేవారు. అదిమొదలు మారకం ఆరంభమైంది. అది బహుశా కొంత అసౌకర్యంగా వుండివుంటుంది. ఒక గింజల బస్తాకోసమో, లేక మరి యేయితర వస్తువుకోసరమో, ఒకడు ఒకఆవునో, ఒక జతగొర్రెలనో చంకబెట్టుకొని పోవలసివచ్చేది. అయితే మాత్రమేమి? వ్యాపారమేమో పెరిగిపోయింది.

బంగారు, వెండి బయట బడగానే, ప్రజలు వెంటనే వాటిని వర్తకానికి ఉపయోగపరచినారు. వాటిని తీసుకొని పోవడం అత్యంత లాఘవం. క్రమేపి, వస్తువుల విలువను

బంగారు వెండితో చెల్లించే అలవాటు వాడుకలోకి వచ్చింది. ఈపద్ధతిని మొదట యోచించినవ్యక్తి నిజంగా చాల సూక్ష్మ బుద్ధిగలిగిన వివేకి. ఈవిధమైన బంగారము, వెండి ఉపయోగం వాణిజ్యాన్ని అత్యంత సుకరము చేసివేసింది. అప్పటికిగూడ, యిప్పటివలె నాణెములు లేవు. బంగారం త్రాచులోతూయబడి, అన్యులకు యిచ్చివేయబడేది. ఆ తర్వాత ఎంతో కాలానికి, టంకములు ప్రవేశపెట్టబడినవి. ఇవి వ్యాపారాన్ని మారకాన్ని యింకా సులభపరచినవి. అందరికి ఒకనాణెపువిలువ తెలిసివున్నందున తూకానికి అవసరం లేకపోయింది. ఇక, నేడు నాణెరూపకమైన ధనం సర్వత్రా ఉపయోగింపబడుతున్నది. కాని, వట్టి డబ్బు మాత్రమే ఎందుకు కొరకాదన్న సంగతి గమనముంచుకోవలెను. మనకు కావలసిన యితరవస్తువులను సంపాదించుకోనుమాత్రమే డబ్బు ఉపయోగపడుతున్నది; వస్తువుల మారకానికి సహాయపడుతున్నది. కావలసినంత బంగారము ఉండికూడా తినను కమికెడు అన్నంగూడలేక బాధపడిన మిదాస్‌రాజుకథ జ్ఞప్తికి తెచ్చుకో! కాబట్టి, మన అవసరాలకు తగినవాటిని పొందను ఉపయోగించుకొంటేనేతప్ప ధనం నిరుపయోగమని తేలింది. నాణెములు యింతవిరివిగా ఉపయోగంలో వున్నప్పటికినీ, ఇంకా, ఒక్కొక్కప్పుడు పల్లెటూళ్ళలో జనులు సరకులనే మార్చుకోవడం మనం చూస్తున్నాము; వారుడబ్బిచ్చికొనరు. కాని, అనువుగా, సుకరంగా వుండటంవల్ల సాధారణంగా డబ్బే ఉపయోగింపబడుతున్నది. కొందరు అవివేకులు, కేవలం రిక్తధనమే గొప్పదనుకొని

ధారాళంగా ఉపయోగించకుండా, ధనాన్ని చేర్చి కూడబెట్టి, దాచిపెట్టుతున్నారు. దీనివల్ల వారికి, ధనమంటే ఏమిటో?



సెర్‌టొసారస్ అను ఒక నిర్వాపిత కీటకము-భుజాలవరకు 8 అ. ఎత్తు.

అది మొదటఎలావాడుకలోకి వచ్చిందో? అన్న సంగతులు కించిత్తుగానైన తెలియువని స్పష్టమౌతున్నది.

# 23. భాష - లిపి - సంఖ్యలు

వివిధభాషల విషయం, వాటి పరస్పరసంబంధం విషయం మనము యింతకుముందే ప్రస్తావించి వున్నాము. ఇక, యిప్పుడు ఒకక్షణం భాషయెలా పుట్టివుండవలెనో విచారిస్తాము.

కొన్ని జంతువులు కొన్నిమాటల వుపయోగిస్తున్నవని మనము గుర్తిస్తున్నాము. సాధారణవిషయాలకు కోతులు కొన్ని అరవులు లేక మాటలు వాడుతున్నవని అంటారు. కొన్ని జంతువులు భయపడిపోయినప్పుడు, కొన్ని వింతశబ్దాల చేసి, తమ కాసన్నమైన ఉత్పాతం నుండి రక్షించుకోమని యితరజంతువులకు సంజ్ఞలుచేయ ప్రయత్నించడం నీవు బాగా చూడగలవు.

బహుశా, ఇదేవిధంగా మానవులలోకూడా భాష ఆవిర్భవించి వుంటుంది. ప్రారంభదశలో జంకు, ఎచ్చరికలకు వట్టికేకలు మాత్రమే వుండివుండవలె. ఆ తర్వాత కార్య నిర్వహణ వ్యథలో పుట్టిన మూల్గులు వచ్చివుండును. కొందరుచేరి ఒకపని చేసేటప్పుడు సాధారణంగా వారందరు ఒకేగొంతుగా ఒకధ్వనిని చేస్తారు. బరువులు యీడ్చే వారిని పెద్దబరువును లేవనెత్తేవారిని నీవు చూడలేదా? అందరు కలిసి ఒకటిగా అరిస్తే పని సులువు అయ్యేటట్లున్నది. ఈ కార్యక్లేశ జనిత ధ్వనులే మానవుని మొదటి మాటలై వుంటవి.

క్రమేపి, చిన్నమాటలు-నీరు, నిప్పు, గుర్రం, ఎలుగు బంటి మొదలైనవి వచ్చివుంటవి. బహుశా అప్పుడు నామ వాచకాలేగాని క్రియావాచకాలు వుండవు. ఒకడు, తాను ఒక ఎలుగుగొడ్డును చూచినానని చెప్పదలచుకొంటే ఒకే మాటగా 'ఎలుగు' అని, పసిబిడ్డమాదిరి సంజ్ఞలు చేస్తాడు. ఆదినాలలో సంభాషణలు అంతగా వుండుట దుష్కరం.

భాష క్రమంగా పెరిగింది. మొదట చిన్నవి, ఆ తర్వాత పెద్దవి వాక్యాలు వచ్చినవి. ఏకాలంలోగాని, వివిధ మానవ వర్గాలకు ఒకేభాష వుండివుండదు. అయినప్పటికి అప్పుడు విశేషంగామాత్రం భిన్నభాషలు వుండివుండవు. ఇంతకుముందే చెప్పినట్లు ఆదినాలలో కొద్దిభాషలే వుండినవి. ప్రతి ఆదిమభాష తమతను భాషాసంతానాన్ని పెంచి, ప్రబలం చేసుకొన్నది.

ఇప్పుడు. మన ప్రస్తావనలో వుండే, ఆదిమనాగరకతా కాలంలో భాష చాల వృద్ధిచెందింది. అనేక గేయాలు, పాటలు వుండినవి; వాటిని కవులు, గాయకులు, వైతాళికులు గానంచేసేవారు. ఆ దినాలలో వ్రాతగాని, పుస్తకాలుగాని అంత విరివిగా లేనందున, చాలావరకు ప్రతిదానిని ప్రజలు కంఠస్థం చేసుకోవలసివచ్చేది. యమకరచన, పద్యరచనలు కంఠోపాఠంచేసి జ్ఞాపకముంచుకొనుట తేలిక. కాబట్టే, ఆదిమనాగరకత వెలసిన దేశాలన్నిటిలోను, యమక కవిత్వము, గేయాలు అశేషజనప్రియాలై వ్యాప్తిలో వుండినట్లు కనబడుతున్నది.



స్ఫిన్క్స్

ఈకవులు, గాయకులు మృతులైన తమ వీరుల ప్రఖ్యాతిని కీర్తించి, పాడుటయందే ముఖ్యముగ ఆసక్తిని చూపినారు. ఆదినాలప్రజకు యుద్ధాలే బాగా నచ్చినవి కాబట్టి, పాటలన్నీ యుద్ధశౌర్యమును గూర్చే ఆలపించినవి. ఇది మనదేశంలోవలె యితరదేశాలలోగూడ ప్రత్యక్షం.

లిపిగూడ కౌతూహలపూర్ణంగా ప్రారంభమైంది. చైనావారి లిపి సంగతి చెప్పివున్నాను గదూ! లిపి మొదట బొమ్మలుగా ప్రారంభమై వుండవలె. ఒకడు నెమలి సంగతి చెప్పవలెననుకొంటే, దాని బొమ్మవ్రాసి తెలియజెప్ప యత్నించేవాడు. అయితే, యిట్లు అందరు విశేషంగా వ్రాయలేరులే. రానురాను యీ చిత్రాలు సులభాలు, సులభతరాలు అయిపోయివుంటవి. ఆ తర్వాత ఎంతో కాలానికి అక్షరాలను గూర్చి పరిశ్రమ జరిగి, వృద్ధిచేయబడి వుంటవి. లిపితోగూడ వ్రాత మంచినీళ్లప్రాయమైంది; పెంపు పరుగువేసింది.

సంఖ్యలు – గణనము నాటిమానవునికి గొప్ప ఉపలబ్ధి. అంకెలులేకపోతే ఏ వ్యవహారంగాని ఎలా జరుగగలదో వూహించటం చాలాకష్టం. అంకెలు కనిపెట్టిన వ్యక్తి నిజంగా గొప్పఉపజ్ఞాపరుడు! మొదట యూరపులో అంకెలు చాల చీకాకుగావుండేవి. I, II, III, IV, V, VI, VII, VIII, IX, X– ఇలాంటివాటిని రోమకసంఖ్య లంటారు, నీకు తెలుసుగదా! ఇవిచిక్కుగా, వ్రాయనే కష్టంగా వుంటవి. ఇప్పుడు ప్రతి భాషలో ఉపయోగించే అంకెలు చాలా సులభాలు. అంటే 1, 2, 3, 4, 5, 6, 7, 8, 9, 10–అనే సంఖ్యలు. మొదట

యూరపువాసులు వీటిని అరబ్బులదగ్గర నేర్చుకొన్నారు కాబట్టి, వారు వీటిని అరబిక్ సంఖ్య లంటారు. కాని, అసలు, అరబ్బులే హైందవులదగ్గర వీటిని నేర్చుకొన్నారు కాబట్టి, వీటిని హైందవసంఖ్య లంటే బాగా పేరు అతికిపోతుంది *

నేను అతిత్వరగా సాగిపోతున్నానే! మనమింకా అరబ్బులదగ్గరకు రాలేదు.



* మొదట అంకెలు 9 వరకే మానవుడికి తెలిసివుండినవి. భారతీయులు 'సున్న'ను ప్రసాదించి లెక్కల పెంపుకు సహాయపడినారు. దశాంశము (డెసిమల్), రేఖా (Geometry), బీజ (Algebra) గణితాలుగూడ హిందూదేశంలో పుట్టి, యితరదేశాలకు ప్రాకిపోయినవి.

—అనువాదకుడు.

# 24. వివిధ మానవ వర్గాలు

బాలబాలికలకు, ఇంకా ఎదిగినవారికి కూడా, చరిత్ర నేడు ఒకవింతపద్ధతిలో గరపబడుతున్నది. రాజులు మొదలైనవారి పేర్లు, యుద్ధకాలాలు, ఇంకా యిలాంటివి అందరూ నేర్చుకొంటున్నారు. కాని, చరిత్ర అంటే ఏవో కొన్ని యుద్ధాలు, రాజులు, సేనానులు అయిన కొందరి కథలే కాదు. ఒకదేశప్రజనుగురించి, వారిజీవనాన్ని గురించి, వారిచర్యలను గురించి, వారి విజ్ఞానాన్నిగురించి, వారి భావసరణినిగురించి చరిత్ర మనకు భోదించవలె. అది వారి ఖేదమోదాలు, వారి కష్టసుఖాలు, కష్టములనుండి బయటపడను చేసిన వారి ప్రయత్నాల మనకు ఎరిగించవలె. ఈవిధంగా మనం చరిత్రచదివితే దానినుండి మన మెంతో నేర్చుకోగలము. అదేమాదిరి కష్టాలు, క్లిష్టాలు మనలను ఎదురుకొంటే, మన చరిత్రపఠనం ఆ యిక్కట్టుల తొలగించుకోనుసహాయపడుతుంది. ముఖ్యంగా మానవజాతి వృద్ధి జెందుతూవచ్చిందో, లేక క్షీణిస్తూ పోయిందో, పురోగమనం జరిగిందో లేదో, అన్నసంగతి గతచరిత్రావలోకనంవల్ల తెలుస్తుంది.

పూర్వీకులైన మహాపురుషుల, స్త్రీల చరిత్రనుండి కొంత మంచివిషయాల నేర్చుకోను ప్రతివాడు కొంత ప్రయత్నించవలసివున్నది. దీనితో గూడ, ఆ దినాలలోని వివిధ మానవజాతుల పరిస్థితులనుగూడ తెలిసికొన యత్నించవలెను.

నీకు ఎన్నో జాబులు వ్రాసినాను. వాటిలో ఇది 24-వది. కాని, యింతవరకు మనకంతగా తెలియని ఆ పురాతన కాలాన్ని గురించే విచారించివున్నాము. దీనినే చరిత్ర అన లేము. కావాలంటే దీనిని చరిత్రారంభము లేక, చారిత్రక ఉషస్సు అనవచ్చును. త్వరలోనే,మనకు కొంత తెలిసిన, చారిత్రకయుగం అనదగిన, తర్వాతికాలాన్ని గూర్చి సమాలోచిస్తాము. కాని, ప్రథమనాగరతను గురించి ముగించేదానికి ముందు, మరియొకమారు వాటిని సింహావలోకనం చేసి,* ఆ యుగంలో ఎట్టి భిన్నజాతులవారు నివసించుచుండినది చూస్తాము.

ఆదిమ వర్గాలవారు, ఎలా వేరువేరుపనులు చేయను ప్రారంభించింది ఇంతవరకే మనం చూచివున్నాం. అపుడు కృషివిభాగం వుండేది. ఇంకా, వర్గనాయకుడు - కులపతి తన కుటుంబాన్ని యితరులనుండి వేరుచేసుకొని, పై పెత్తనం మాత్రమే చేస్తుండిన విషయాన్నిగూడ తెలిసికొన్నాము. ఆయన పైఅంతస్తు మనిషి అయిపోయినాడు; అంటే, అతని కుటుంబము యితరసామాన్య ప్రజలకంటె భిన్నమైపోయింది అని అనవచ్చును. ఇట్లు, పెత్తనంచేసి కార్యంనడిపేకటువారు, అసలు పనిని చేసేవారు అని సంఘం రెండు తెగలుగా చీలిపోవడం మనకు కాన్పిస్తున్నది. ఇక పెత్తనం చేసేతరగతి ఎక్కువ అధికారయుతమై, యీ అధికారం మూలాన ఓపినట్లుగా కావలసినవన్నీ సేకరించుకోగలిగింది. ఇలా

---

*సింహం కొంతదూరం నడచి, నిలిచి, వెనుకకుతలత్రిప్పి, వచ్చిన దారినిచూచి మరల ముందుకు సాగటం అలవాటు. —అనువాదకుడు.

పాటకజనంనుంచి ఎక్కువ లాగుకొనగా లాగుకొనగా పెత్తన దారులు మెట్టుమెట్టుగా ధనవంతులై పోయినారు.

ఇక, ఇట్లు కృషి విభజన చీలికలై చీలికలై పోగా పోగా, అనేక తరగతులు తలయెత్తినవి. రాజు, అతని అంతః పురజనము, ఆస్థానోద్యోగులు ఏర్పడినారు. వారు దేశ పాలన, పెత్తనం చూచుకొంటూ, దేశంకొరకు పోరాడు చుండినారు. సాధారణంగా వారు యితరపనులు ఎరుగరు.

వీరితర్వాత, దేవాలయ పూజారులు, ఇంకా దేవాల యానికి సంబంధించిన ఇతర సిబ్బంది వుండినారు. వారు ఆ దినాలలో చాలా ప్రముఖులు; కాబట్టి వారి కార్యకలాపాల ప్రత్యేకంగా విచారిస్తాము. ఇక, మూడవకులంవారు వ్యాపా రులు. దేశంనుండి మరియొక దేశానికి వ్యాపారవస్తువుల దీసి కొనిపోయినవారే. వీరు సరకులను కొని, అమ్మను అంగళ్లు పెట్టినారు. నాల్గవ కతువారు కర్మకారులు. అంటే-వివిధవస్తు చయాన్ని చేసేవారు, నూలువడికి బట్ట నేసేవారు, కుండలు చేసేవారు, యిత్తడి సామాగ్రి పోతబోసేవారు, బంగారు, వెండి, దంతపు వస్తువులు చేసేవారు; ఇంకా నానావిధ అవ సరవస్తువుల చేసేవారు. వీరు చాలమటుకు పట్టణాలలోనో, పట్టణ పరిసరాలలోనో నివసించేవారు. కాని, పల్లెలలో గూడ చాలమంది వుండేవారు.

చివరన, పొలాలలో, పట్టణాలలో పాటుపడే పనిబా టలవా రుండినారు. ఇదే అన్నిటిలోకి పెద్దతరగతి. పై తరగతులన్నీకూడా వీరినుండి ఏదోకొంత గుంజుకోను ప్రయ త్నించినవి.

---

# 25. రాజులు - దేవాలయాలు - గురువులు

గత లేఖలో ఐదు భిన్నకక్షులు ఏర్పడినట్లు చూచినాము. వాటిలో పెద్దది కర్షకులది, కార్మికులది. వ్యవసాయికులు భూమినున్ని, పైరుబెట్టి, ఆహారం పండించినారు. ఈకాపులు వ్యవసాయం చేయకబోతే, యితరులెవరు పొలాలలో పనిచేసివుండరు. కాబట్టి, ఆహారమే దొరికివుండదు; అథవా, లభించినా, బహుస్వల్పం. కాబట్టి కర్షకులు సంఘమునకు అత్యంత ముఖ్యులని తేలింది. 'కృషితోనాస్తి దుర్భిక్షం' అన్నారు. వారు లేకుంటే అందరూ ఆకట మాడవలసిందే! కార్మికులుకూడ పట్టణాలలో, పల్లెల పొలాలలో చాల ఉపయుక్తమైన పనులుచేసినారు. ఈప్రజ యింత ముఖ్యమైన కృషి జేసినప్పటికిని, ప్రతివానికి అత్యవసర అంగమై వుండినప్పటికిని, వారిపని వారికి బహుస్వల్పంగా మాత్రమే ప్రతిఫలం ముట్టజెప్పింది. వారు పండించినదానిలో ఎక్కువపాలు యితరులకు పోయింది. ముఖ్యంగా రాజులు, వారి తరగతివారైన సామంతులు, భూస్వాములు ఫలింపునంతా అనుభవించేవారు.

రాజుకు, అతని పరిజనానికి చాలా అధికారం వుండినట్లు చెప్పినాను. తెగలు ఏర్పడినక్రొత్తలో భూమియావత్తూ తెగది; దానిపై ఏ ఒక్క వ్యక్తికిగాని హక్కులేదు. కాని, రాచరికపుటధికారం పెరిగిన కొలది, రాజులు భూమి తమ సొంతం అన్నారు. వారు భూస్వాములై, భూమిపై కష్టించి

పనులు చేసిన అసలు పనివారువూరకే వారి యిచ్ఛాధీనమైన సేవకులై, ఒకవిధంగా కూలివారైనారు. సేద్యగాడు భూమిలో ఉత్పత్తిచేసినదంతా పంపకం చేయబడి, పెద్దవంతు భూస్వామికి పోతూవచ్చింది.

కొన్ని దేవాలయాలకుగూడ మాన్యపుభూము లుండినందున, దేవుళ్లుగూడా భూస్వాములైనారు.

దేవాలయాలు, వాటి పూజారులను గురించి శాస్త్ర పరికిస్తాం. ఇంతకుముందు జాబులలో ఏదో ఒకదానిలో, ఆదిమ ఆరణ్యకప్రజ తమచుట్టూవున్న విషయాల చాల వాటిని అర్థం చేసుకోలేక, అర్థంకానివాటికి భయపడుతూ, దైవచింత, ఆతర్వాత మతమును గురించి యోచించడం ప్రారంభించి నారని చెప్పివున్నా. ప్రతిది వారికి దేవుడో, దేవో అయింది; ఏరు, కొండ, సూర్యుడు, చెట్టు, పశువుల సేవించి, కనబడనివాటిని భూతాలుగా వూహించుకొంటూ పూజించినారు. వారు భయపడిపోయినారు కాబట్టి, దేవతలు తమ్ము శిక్షింతురని భావించేవారు. తమవలెనే, వారికి తమ దేవతలుగూడ నిర్దయులుగా, క్రూరులుగా గాన్పించినారు. కాబట్టె ఆ క్రూరుల రంజింపజేసి, ప్రశాంతుల జేయను బలులు, యాగాలు చేయను ప్రజలు ఎల్లప్పుడూ ప్రయత్నిస్తుండినారు.

ఈ దేవతలకు గుడులు కట్టబడినవి. దేవాలయం లోపల ఒక పుణ్యస్థలము - దైవాయతనము అనబడే ఒక చిన్నగది - వుండేది. ఆ గర్భాలయంలో తాము పూజించే

దేవుని ప్రతిష్ఠించినారు. తమ దృష్టిగోచరముగాని దానిని వారు పూజించలేరుగదా! ఇది కొంత దుష్కరము. ఒక పసిబిడ్డ తాను చూచినవాటిని గూర్చి సునాయాసంగా గ్రహించగలదని నీకు తెలిసిన విషయమేగదా! ఆదిమ మానవులు ఒకవిధముగా శిశువులవలె వుండినారు. వారు మూర్తి లేని దే పూజించలేక పోయినారు కాబట్టి, దేవాలయాలలో విగ్రహాల నిలువబెట్టినారు. దీనిలో వింత ఏమిటంటే- ఈ ప్రతిమలన్నీ మహావికారంగా వుండేవి; ఇవి ఒకచోట జంతువులుగా, మరియొకచోట సగంమనిషి, సగం మృగంగా వుండేవి. ఈజిప్టులో ఒకకాలంలో పిల్లిని యిలవేల్పుగా కొల్చినారు. మరియొకప్పుడు కోతినిగూడ పూజించినట్లునాకు జ్ఞాపకం. ఇలా, వికృతభయంకర జంతుప్రతిమా సంపూజనముల ప్రజ లెందుకు చేస్తుండినారో మనకు దుసూహ్యంగా వున్నది. విగ్రహాన్నే పూజించవలసివస్తే, దాన్ని మనోజ్ఞంగా ఎందుకు చేయరాదో? దేవతలు భయోత్పాతం కలిగించవలసినవారు కాబట్టి, బహుశా ఆ ఉద్దేశంతో దేవత లిట్లు భయంకరులుగా సృష్టింపబడి వుందురు.

చాలామంది యిప్పుడు భావించేటట్లు, దేవుని ఒకడుగా, ఒకే బ్రహ్మాండశక్తిగా, నాటివారు అనుకొని వుండరు. వారు అసంఖ్యాకమైన దేవులు, దేవతలు వుండినట్లు భావించినారు. ఇంతేగాకుండా, వారి దేవగణం ఒకరితో నొకరు తీవ్రంగా పోరాడుచుండినారు. ప్రతి దేశానికి, ప్రతి పట్టణానికి, ప్రతిగ్రామానికి వేరు వేరు దేవుళ్లు వుండి, వేరు వేరు విధాల పూజ లందుచుండినారు.

దేవాలయాలు పూజారులు, పూజారిణులతో నిండి పోయి వుండేవి. సాధారణంగా యీ పూజారులకు చదువను వ్రాయను వచ్చివుండేది; అందువల్ల మిగతవారికంటె వారు విజ్ఞానులైనారు. ఇక వారే రాజులకు మంత్రులు - ఉపదేష్టలు అయినారు. ఆదినాలలో యీ గురువులే పుస్తకాలు వ్రాసి, పాతవాటికి ప్రతులు వ్రాసిపెట్టేవారు. వారికి కొంత జ్ఞానం అలవడినందున ఆ కాలానికి వారే వివేకవంతులైనారు. వైద్యులు గూడ వారే! వారి తెలివితేటలను ప్రజలకు నచ్చజేయను పలుమారు వారు కొన్ని తంత్రాల, మంత్రాల, క్షుద్రవిద్యల ప్రదర్శించి, ప్రజల లోగట్టుకొనేవారు. జనసామాన్యము అమాయకులై, అజ్ఞానాంధులై, ఈ గురువుల మంత్రదక్షులని భ్రమించి, వారంటే భయంతో వణకిపొయ్యేవారు.

అన్నివిధములా యీ పూజారులు, యీ పురోహితులు ప్రజాజీవనంతో పెనవేసుకొని పోయినారు. వారు విజ్ఞానులు కావడంవల్ల మంచికి చెడ్డకు, మందుకు మాకుకు-ప్రతిదానికి ప్రజలకు వారే శరణ్యమైనారు. వారు ప్రజల వినోదార్థం పెద్ద పండుగలు జరిపించేవారు. ఆ దినాలలో జనసామాన్యానికి పంచాంగాలులేవు. పర్వదినాలు గుణించుకొనేవారు.

గురువులు తరుచు ప్రజల మోసగించి, తప్పుత్రోవకు నడిపినా, కొన్నిసమయాలలో పలువిధాల వారికి సహాయపడి వారి అభివృద్ధికి తోడ్పడేవారు.

మొదట ప్రజలు పట్టణాలలో స్థిరనివాస మేర్పరచు కొన్న దినాలలో వారిని పాలించింది యీ గురువులే అయి యుండవచ్చును. రాజులు యింకా రాలేదు. తర్వాత రాజులు వచ్చి పురోహితుల తొలగించి, యుద్ధం చేయను చేతవచ్చి నందున వారి స్థానాల ఆక్రమించుకొన్నారు. మరికొన్ని దేశాలలో, ఈజిప్ట్‌లోని ఫెరోలవలెనే, పురోహితుడును, రాజును ఒకడే అయివుండినారు. ఫెరో బ్రదికి వుండగానే సగం దేవుడుగా ఎన్నబడు చుండినాడు; ఇక మరణానంతరము అసలు దేవుడుగానే ఆరాధింపబడేవాడు.



# 26. సింహావలోకనము

నా జాబులతో నీకు బాగా విసుగెత్తిపోలేదా? నీకు కొంత విశ్రాంతి అవసరం అనుకొంటా. సరే! ఇక కొంత కాలం కొత్తలేమీ నీకు వ్రాయను లే! ఇంతవరకు మనం చేసిన పనిని కొంత సాంతంగా పునరాలోచించమంటాను. కొన్ని ఉత్తరాలలో అనేకలక్షల సంవత్సరాల దాటి వచ్చేసినాము. భూమిసూర్యునిలో భాగమై వుండినది మొదలు, అది సూర్యునినుండి విడబడి, మెల్లిగా చల్లారిపోయినంత వరకు చూచినాం. ఆ తర్వాత చంద్రుడు వేరై పోయినాడు. కొన్నియుగాల దీర్ఘకాలంవరకు చైతన్యమే లేదు. అవతల, అసంఖ్యాకమైన దశలక్షలవర్షాలు దొర్లిపోగాపోగా, మంద మందంగా జీవలక్షణాలు ఏర్పడి ఎదిగినవి. కోట్లపరిమితి సంవత్సరాలను వూహించుకోవడం చాల కష్టతమమైనపని. నీకు పదేండ్లే అయినా, నీవెంత పొడిగా ఎదిగి, వయస్సు వచ్చివున్నావు! నీవు యువతివైనావు! నూరేండ్ల ప్రాయము నీకు సహింపరానంత దీర్ఘము. ఇక లక్ష-పదిలక్షల సంగతి చెప్పవలెనా? ఈ లెక్కలను మన చిన్నతలలోకి సరిగా ఎక్కించుకోలేమనుకొంటా. అబ్బా! మన కెంత అహంభావ మున్నదంటే, మనమే అన్నిటా ప్రధానులమనుకొని, స్వల్ప విషయాలకు కోపపడి, చింతాకులురము అవుతున్నాము. అయితే, యీక్షణిక క్షుద్ర సంఘటనలు ప్రపంచ దీర్ఘతమ చరిత్రలో ఏపాటివి? ప్రపంచ చరిత్రలో అంతటి దీర్ఘవ్యాప్తి

యుగాలనుగూర్చి చదివి, వాటినిగురించి కొంత నేర్చుకొనడం



కార్నాక్ (ఈజిప్ట్) పట్టణమందలి ఒక దేవాలయ శిథిలములు.

మనకు లాభమే! ఎందువల్లనంటే, యీ పెద్దవిషయాలు

తెలుసుకొన్న తర్వాత, స్వల్పవిషయాలు మనకంత లెక్క లోకిరావు; అవి మనలను నొప్పించవు.

జీవమే లేక, జడమైయుండిన ఆ మహత్తర దీర్ఘకాలమును మనం జ్ఞప్తియందుంచుకొందాం. ఆ తర్వాత, సముద్రంలో జంతుజీవం దప్ప, మరి యితరమే లేని ఇంకొక దీర్ఘయుగాన్ని స్మరించుకో. ఇంకా మానవ సృష్టే లేదు. జంతుకోటి వుత్పన్నమై, అనేక దశలక్షల సంవత్సరాలు భూమంతా తిరుగాడుచుండినవి; వాటిని వేటాడి చంపే మనిషే లేడు. చిట్టచివరకు మానవుడు వచ్చినాడు. అతడు క్షుద్ర, అసహాయ, స్వల్పజీవి. జంతువులన్నిటిలో దుర్బలుడు. మెల్లిగా, కొన్ని వేల యేండ్లలో బలయుతుడై, వివేకవంతుడై, చివరకు భూజంతుగణానికంతా యజమాని అయినాడు. ఇతర జంతువులన్నీ అతని దాసులు - బానిసలు అయినవి; అతని కనుసన్నలమెలగి, కార్యాల నిర్వహించినవి.

ఆ తర్వాత, నాగరకతాభివృద్ధి ఘట్టానికి వచ్చినాము. దాని ఆదిమపుట్టువును చూచినాము; ఇకపైన దాని వృద్ధిని గమనించ యత్నిస్తాం. నాలుగైదువేల సంవత్సరాల నాటి ఘట్టంవరకు ఈ జాబులలో మనం వచ్చాం. మానవుని పెంపు, అతని చరిత నిజంగా యీ నాలుగువేల యేండ్లలోనే సంభవించినవి. నీవు పెరిగి పెద్దదానవైనప్పుడు, యీ చరిత్ర వివరాలు చదువగలవు. మనయీ చిరుత ప్రపంచకంలో, మానవునికి ఏమిసంభవించినదో దానిని తెలుపడానికి ఇప్పుడు కొద్దిగా వ్రాస్తాను. దిఙ్మాత్రంగా నీకు తెలుపడానికి ఇప్పుడు కొద్దిగా వ్రాస్తాను.

---

# 27. ఫాసిల్సు - శిధిలాలు

నీకు జాబు వ్రాసి చాలకాలమైంది. మన జాబులలో వివరించిన పురాతనయుగములను గూర్చి, వెనుకటి రెండు లేఖలలో సంక్షిప్తంగా మననం చేసినాము. పాషాణాంతర్గత మత్స్య అస్థిపంజరాల బొమ్మలను నీకు పంపినాను. వాటివల్ల ఫాసిల్సు అంటే ఏమో నీకు అర్ధమౌతుంది. ముసోరిలో నీవు వచ్చినప్పుడు మరికొన్ని ఫాసిల్సుయొక్క చిత్రాలను చూపి వున్నా.

ముఖ్యంగా రాళ్ళలో యిమడిపోయి ఇంతవరకు కాపాడబడిన ప్రాక్ కీటకాల ఎముకల గూళ్లు (ఫాసిల్సు) నీకు జ్ఞాపకం వుండి వుంటవి. కీటకాలుఅంటే యిప్పుడు మనం చూచే పాము, బల్లి, ముసలి, తాబేలు మొదలైన ప్రాకి పొయ్యే పురుగులు. పూర్వపు కీటకాలు ఇప్పటివాటి వంశానికి సంబంధించినవైనా, అవి చాలా భేదంతో పెద్ద పెద్దవిగా ఉండేవి. మనం సౌత్ కెన్సింగ్టన్ మ్యూజియంలో చూచిన భయంకర భూరిసత్వాలు నీకుజ్ఞాపకం వున్నవిగదూ? వాటిలో ఒకటి 30, 40 అడుగుల పొడవున్నది. ఇంకా ఒకవిధమైన కప్ప - మనిషికంటె పెద్దది; దానితో సమానమైన ఇంకొక తాబేలుగూడ ప్రదర్శింపబడి వున్నది. ఆ కాలంలో చాలా పెద్ద గబ్బిలాలు ఆకాశంలో తిరుగాడుచుండేవి. ఇగ్నొనాడన్ అనేజంతువు వెనుక కాళ్ళమీద నిలువబడితే ఒక పెద్ద చెట్టంత వుండేది.

అక్కడ పాతచెట్ల ఫాసిల్సు గూడ చూచినావు. ఆ వాళ్ళలో అందంగా యీతమట్టలవంటి గుర్తులు ఏర్పడి వున్నవి. ఇంకా కొన్నిటిలో ఆకులు, చెట్లు వుండినవి.

ఈ కీటకాల తదనంతరం ఎంతోకాలానికి, పిల్లలకు పాలిచ్చి పెంచే స్తన్యదాలైన జంతువులు ప్రభవించినవి. మనచుట్టూతిరుగాడే తిర్యగ్జంతువులు, అంటే- అడ్డంగానడిచే పశ్వాదులు, మనముగూడ పాలిచ్చేగణానికి (మ్యామల్సు) జెందినవారమే. పాత మ్యామల్సుకు, నేటి మన జంతుకోటికి ఏమంత భేదములేదు. పూర్వపువాటిలో కొన్ని పెద్దవైనా కీటకాలంత పెద్దవికావు. పొడుగైన కొమ్ములతో ఏనుగులు, పెద్ద శరీరాలతో ఎలుగుబంట్లు వుండేవి.

నీవు ఒకమానవుని ఫాసిల్ గూడ చూచినావు. సాధారణంగా అవి కేవలం ఎముకల కుప్పలుగా వుండినందున ఏమంత ఆకర్షణీయంగా వుండలేదు. అన్నిటికంటె ఎక్కువగా ఆసక్తిని గూర్చినట్టిది, ప్రారంభమనుష్యులు చేసి, ఉపయోగిస్తుండిన చెకిముకి పనిముట్లే!

ఇజిప్షియనుల సమాధులయొక్కయు, మమ్మీల యొక్కయు బొమ్మలను చాలామంచివాటిని గూడ నీకు చూపివున్నా. వాటిలో కొన్ని చాలాఅందంగా వుండలేదా? శవపేటికలపై మంచి కథలు, బొమ్మలలో మనోజ్ఞంగా బచ్చెనబోసి వుండినవి. వాటిలో అత్యంత ఆకర్షణీయమైనవి థేబెస్‌పట్టణములో ఇజిప్షియను సమాధులలోని కుడ్యచిత్రలేఖనములు.

ఈజిప్టులో థేబెస్‌నగర దేవాలయ హర్మ్యశిథిలాల చిత్రములగూడ నీవు చూచియున్నావు. పెద్దపెద్ద స్తంభాలతో

గూడిన బ్రహ్మాండమైన కట్టడాలు అవి. థేబెస్ సమీపంలో మిన్నులను దన్నే మెమన్ శిలావిగ్రహం వున్నది.

ఎగువ ఈజిప్టులో కార్నక్ నగరముయొక్క శిధిలాలను గూడ బొమ్మలలో చూచినావు. ఆ పాడంతయు దేవాలయాలు, రాజమందిరాలే! ఈ జీర్ణ భవనాలవల్ల గూడ ఆ దినాలలో ఇజిప్షియనులు ఎంతటి గొప్ప నిర్మాతలో నీవు భావించుకోవచ్చును. వారికి నిర్మాణశాస్త్రం బాగా తెలిసి వుంటేగాని యింత పెద్దపెద్ద భవనాలను ఎలా నిర్మించగలిగి యుందురు!

ఇంతటితో మన సంక్షిప్త పూర్వవృత్తాంతానుదర్శనము ముగించినాము. ముందుజాబులలో తర్వాత వృత్తాంతాలకు పోదాము.



# 28. హిందూదేశమునకు ఆర్యుల ఆగమనము

ఇంతవరకు మనము చాలా చాలా పాతకాలాన్ని గురించి విమర్శించి వున్నాము. ఇప్పుడు మానవుడు యెట్లా అభివృద్ధి నొందినాడో, అతడేమి చేసినాడో పరికిస్తాము. ఈ కాలాన్ని చరిత్ర పూర్వయుగమంటారు. ఎందుకంటే ఆకాల యథార్థచరిత్ర లేదు. విశేషభాగం మనం వూహించ వలసినదే. ఇప్పుడు మనము చరిత్రసీమల అంటివున్నాము.

మొదట హిందూదేశంలో ఏమిజరిగిందో చూస్తాం. ఈజిప్టువలె హిందూదేశంలోగూడ పూర్వయుగాలలో నాగరకత వెలసివుండినట్లు యింతకుముందే తెలిసికొన్నాము. ఇచట వర్తకం విరివిగా సాగింది; నావికాదళము హిందూదేశమునుండి సామగ్రిని ఈజిప్ట్, మెసపొటామియా మున్నగు దేశాలకు కొనిపోయినది. ఆ కాలంలో హిందూదేశంలో నివసించుచుండినవారిని ద్రావిడులు అన్నారు. వారి సంతతి వారే యిప్పుడు దక్షిణభారతంలోను, చెన్నపట్నం పరిసరాల లోను నివసించేది.

ఈ ద్రావిడులపైకి ఉత్తరంనుండి ఆర్యులు దండెత్తి వచ్చినారు. మధ్యఆసియాలో యీ ఆర్యులగుంపులలో మూక అపరిమితంగా వుండివుండవలెను; అందువలన అక్కడ అందరికి చాలినంత ఆహారము లభించక, యితరదేశాలకు వ్యాపించినారు. పెద్ద పెద్ద గుంపులు పర్షియాకు పడమట

గ్రీసువరకు ప్రాకిపోయినారు. కాశ్మీరపర్వత కనుమలగుండా యీ ఆర్యులు హిందూదేశంలోనికి కూడ, తండోప తండాలుగా, వచ్చినారు.

ఆర్యులు యుద్ధప్రియులైన బలశాలురు. వారు ముందుకు సాగుతూ, ద్రావిడులను తరిమి నెట్టుతూ వచ్చినారు. వాయువ్యదిశనుండి వారు తరంగాలు తరంగాలుగా వెంబడి వెంబడి ప్రవేశించివుంటారు. బహుశా, ద్రావిడులు వారిని మొదట ఆపగలిగినారేమోగాని, గుంపులు జాస్తిఅయిన కొలది, నూతనాగంతుకులను అడ్డను సాధ్యంకాకపోయింది. చాలా కాలంవరకు ఆర్యులు ఉత్తరాన, అఫ్ఘనుస్థానము, పంజాబులలోనే నిలిచివుండినారు. ఆ తర్వాత ఇంకా క్రిందికి దిగివచ్చి, మన నివాసమైన యిప్పటి సంయుక్తపరగణాలలోనికి ప్రవేశించినారు. మధ్యహిందూదేశంలో వింధ్యాచలం వారి గమనాన్ని నిరోధించేవరకు ఎగబ్రాకుతూనే వచ్చినారు. ఈ కొండలు కారడవులచేత దట్టంగా కప్పబడి ఉండినందున వారు అందు చొరలేకుండినారు. కాబట్టి వింధ్యపర్వతాలకు ఈవలనే చాలకాలంవరకు ఆర్యులు నిలిచిపోయియుండినారు. వారిలో చాలమంది సాహసించి దుర్గమపర్వతశ్రేణుల అధిగమించి దక్షిణదేశం ప్రవేశించినారు * గాని, ఒక బలగంగా దాటలేక పోయినారు. కాబట్టే దక్షిణం ఆర్యసంపర్కముతో మారక, ద్రవిడముగానే నిలిచిపోయింది.

* మొదట దాటింది అగస్త్యముని అని అంటారు. కాశీఖండంలో శ్రీనాథుడు దీనిని చాలా మనోజ్ఞంగా వర్ణించివున్నాడు. అరవలు అగస్త్యునిరాకతో వృద్ధిజెందినారు.—అనువాదకుడు.

భారతదేశానికి ఆర్యుల ఆగమనవృత్తాంతం చదు



మమ్మీ

వను చాలా సొంపుగా వుంటుంది. వారినిగురించి మనప్రాచీన

సంస్కృతవాఙ్మయం విశేషంగా వెల్లడిస్తున్నది. ఆ కాలం లోనే వేదములు, మరికొన్ని గ్రంథాలు వ్రాయబడి వుండవలెను. మొదటిది-అతిప్రాచీనమైనది ఋగ్వేదము. అప్పుడు ఆర్యులు ఆక్రమించుకొనిన ప్రదేశవర్ణనము, దీనిని చదివిన నీకు కొంత భోదపడగలదు. ఇతర వేదములు, పురాణాదులు ఆర్యుల వ్యాపకముగూర్చి వివరిస్తున్నవి. బహుశా యీ ప్రాచీన గ్రంథాలను గురించి నీకంతగా తెలియ దనుకొంటాను. నీవు పెరిగి పెద్దదానవైతే నీకు తెలుస్తుంది. ఇప్పటికే పురాణాలనుండి వచ్చిన కథలు ఎన్నో నీకు తెలుసును. వీటితర్వాత చాలకాలానికి మహద్గ్రంథము రామాయణము, తర్వాత మహాభారతము బయల్పడినవి. ఆర్యులు ఆదిలో పంజాబు, ఆఫ్ఘనిస్థానాలలో మాత్రమే నివసిస్తుండినప్పుడు యీ భాగాన్ని బ్రహ్మావర్తమని, ఆఫ్ఘనిస్థానాన్ని గాంధారమని వ్యవహరించుచుండినట్లు, ఆర్యులనాటి పుస్తకాలు తెలుపుచున్నవి. మహాభారతంలో గాంధారి గమనమున్నదా? గాంధారదేశం (ఆఫ్ఘనిస్థానము) నుండి వచ్చిన రాకుమారి గాంధారి అన్నారు. ఇప్పుడు ఆఫ్ఘనిస్థానము మనదేశం నుండి వేరై, ప్రత్యేక దేశంగావున్నా, ఆకాలంలో యీ రెండుదేశాలు కలిసి ఒకేనాడుగా వుండినవి. ఆర్యులు, ముందుకు సాగి, క్రిందకు దిగి, గంగా యమున మాగాణ ప్రదేశాలకువచ్చి, నిలిచిపోయిన తర్వాత ఉత్తర హిందూస్థానాన్నంతా ఆర్యావర్తము అన్నారు.

ఇతర ఆదిమమానవులందరివలెనే, ఆర్యులుగూడ నదీతీరాలలో వలస లేర్పరచుకొని, పట్టణాలు కట్టుకొన్నారు. కాశి, ప్రయాగ మొదలగు పట్టణాలు ఏటిదరులలో వున్నవి.

## 29. హిందూదేశ ఆర్యు లెట్లుండినారు?

ఆర్యులు ఐదారువేల యేండ్లకుముందు—బహుశా, యింకా ఎక్కువైగూడ వుండవచ్చును—భారతదేశం లోనికి వచ్చివుందురు. అట్లని, వారంతా ఒకేమారు, ఒకే గుంపుగా వచ్చినారని అనరాదు. ఒకసైన్యం తర్వాత ఒకటి, ఒక తెగ వెనుక ఒకటి, ఒక కుటుంబం వెంట ఒక టిగా కొన్ని వందల యేండ్ల తరబడి వచ్చివుండవలెను. వారు, వారికున్న సమస్త సంపదను, గృహోపకరణములను, బండ్లమీద, పశువుల వీపులమీద గంతలుగా వేసి, చీమల బారువలె, తెంపులేని ఒక దీర్ఘసార్థవాహంలో ప్రయాణం సాగించే దృశ్యాన్ని నీవు వూహించుకో. నేటి యాత్రా ప్రియులవలె వారు ఆ బిడారుల నడుపలేదు. వారు యిప్పటి వారివలె తిరిగి మరల వెనుకకు బోవుటలేదు. ఎక్కడివా రక్కడనే నిలచిపోయి, పోరులో చచ్చుటో బ్రతుకుటో అని బయలుదేరినారు. వారిలో చాలమటుకు వాయవ్య దిక్కుగా కొండకనుమలుదాటి వచ్చినారు. బహుశా, మరి కొందరు పారసీక సముద్రంమీదగా వచ్చి, సింధు ముఖ ద్వారంగుండా, తమ చిన్నపడవలను నదికెదురునడిపి వచ్చి వుందురు.

ఈ ఆర్యులు ఎట్లుండినారు? వారు వ్రాసిన గ్రంథాల నుండి, వారినిగురించి మనమెంతో తెలుసుకోవచ్చును. ఆ పుస్తకాలలో వేదములు మొదలగునవి, ప్రపంచ వాఙ్మయంలో అతి ప్రాచీనతమములు. బహుశా ఆదిలో అవి

లిపిలో వ్రాయబడ లేదేమో! అవి కంఠస్థం చేసుకొనబడి, ముఖతా యితరులకువల్లె చెప్పబడేవి. అవి ఎంతటి రామణీయకమైన సంస్కృతంలో వ్రాయబడివున్నవంటే, కొన్ని ఋక్కులను పాటలుగాపాడవచ్చును. నేటికికూడా, శ్రావ్యకంఠంతో సంస్కృతపండితుడు వేదఋక్కులపఠిస్తుంటే, కర్ణపేయమై, ఆనందకరంగా వుంటుంది. హిందువులు వేదముల పరమ పవిత్రములుగా పూజిస్తారు. ఇంతకు, వేదపదానికి అర్థమేమి? వేదము అంటే విజ్ఞానమని అర్థము. ఆ కాలంలో ఋషులు, మునులు అనబడే మహాపురుషులు, విజ్ఞానఖనులు సేకరించిన విజ్ఞానము వేదములలో పొందుపరచబడి యున్నది. వారికి అప్పుడు తంతివార్తలు, అయోమార్గాలు, చలన చిత్రశాలలు లేవు. లేవని వారిని అజ్ఞానులనరాదు. కొందరు ప్రాక్తన విజ్ఞానులు, నేటివారికంటె ఆనాటివారు తెలివైనవారు, ఎక్కువ తెలిసినవారు అని అంటారు. వారి విజ్ఞానము ఎక్కువైనా, తక్కువైనా వారు అద్భుతమైన గ్రంథాలు వ్రాసినారు. అవి నాటికిని నేటికిని పూజింపబడి, ప్రశంశింపబడుచున్నవి.

ఇంతకుముందు చెప్పినట్లు, యీ వేదాలు మొదట లిఖితరూపంలో లేవు. వాటిని మనసులో బెట్టుకొని, ముఖతా ఒక పురుషాంతరం మరియొకపురుషాంతరానికి ఒప్పగిస్తూ, చింతనజేస్తూ సంక్రమింపజేసింది. నాటి వారి జ్ఞాపకశక్తి అద్భుతంగా వుండివుండవలెనుగదా! పుస్తకములను సొంతంగా మనలో ఎందరు ఒప్పగించగలరు ?

వేదములవ్రాసిన ఆదినాలను వేదయుగ మన్నారు. వేదములలో మొదటిది ఋగ్వేదము : ప్రాచీనార్యులు వల్లించి, గానముచేసిన గీతములతో, ఋక్కులతో నిండి వున్నది. వారు చాలా లఘుహృదయులుగా వుండి వుందురు. మబ్బుగప్పి, చీకాకుతో నలిగి క్రుంగినట్లు గాకుండా వారి మానసాలు కలకలలాడుతు, తెగువ తెంపరితనా లతో నిండివుండినవి. ఆ ఆనందతన్మయతలో అందచందాల గేయాల సృజించి, శ్రావ్యరుతములతో తమ అధిష్ఠాన దేవ తల ఆరాధిస్తూ, తమ మధురకవితల గానముచేసినారు.

వారు, తమజాతి, తమరీతులగూర్చి చాలా గర్వించి నారు. 'ఆర్య' అంటేనే పెద్దమనిషి, అధికుడు అని అర్థం. వారి సంతతులవారైన నేటి భారతీయులు ధైర్య విహీనులై, హరింపబడిన తమ స్వాతంత్ర్యమునుగూర్చి ఏనాడుగాని చింతించి ఎరుగరు. వారికిని, వీరికిని ఎంతభేదము! నాటి ఆర్యులదృష్టిలో దాస్యావమానాల కంటె మరణమే మేలుగా వుండినది.

వారు మంచి సంగ్రామనిపుణులు. వారికి కొంత విజ్ఞానశాస్త్రము (సైన్సు) తెలిసి, వ్యవసాయంలో మంచి చొరవ - ప్రవేశము కలిగియుండినారు. సేద్యం వారికి ప్రాణాధారమైనది కాబట్టి, కృషి చాలప్రధానమైనది; దానితో కూడ వ్యవసాయానికి సహాయకారులైన సము స్తాన్ని వారు ఘనంగా చూచుకొన్నారు. మహానదు లన్ని పుష్కలంగా కమ్మటి నీరమునిచ్చి, తమ క్షేత్రాల సస్య శ్యామలాలుగా చేసినవి కాబట్టి వాటిని ప్రేమించి, వాటిని

హితులుగా, సంపత్ప్రదాతలుగా మన్నించి సేవించినారు. ఆవు జీవన సుధగా భావింపబడే పాలనిచ్చింది; ఎద్దు దున్ని ప్రొద్దుగూకులు సేవకుడుగా వుండినది. అందువల్ల వారు యీ జంతువులను ప్రత్యేకశ్రద్ధతో పోషించి, వీటినికీర్తించినారు. చాలా కాలం గడచినతర్వాత, గోవును పోషించిన అసలు కారణాలు మరచిపోయి, అది అడిగినవారికి అడిగినంత యిస్తుందని పూజింపసాగినారు.

ఆర్యులు తమజాతిపట్ల ఎక్కుడు అభిమానం కలిగియుండినందున, హిందూదేశంలోని యితరులతో సంపర్కము కలిగించుకోను భయపడినారు. అందువల్లనే సంకరము జాతిలో ప్రవేశించకుండ జేయను, ఆర్యులు యితరులతో వియ్యమందరాదని నిషేధించి, శాసించినారు. ఇదే చాలా కాలానికి నేటి వర్ణాశ్రమవిధానంగా పరిణమించింది. నేడు ఇది అపహాస్యంగా పరిణమించిందిలే! కొందరు, యితరులను తాకను, వారితో సపజ్త్తిభోజనంచేయను భయపడుతున్నారు. అదృష్టవశాత్తు నేడు యీభావం సన్నగిలి పోతున్నది.



# 30. రామాయణము - మహాభారతము

ఆర్యావర్తంలో వేదవాఙ్మయము ప్రభవించిన వేద యుగానంతరం ఐతిహాసిక యుగమనేదివచ్చింది. రెండు పెద్ద ఇతిహాసములు వ్రాయబడినకాలం కాబట్టి దాన్ని ఐతిహాసిక యుగ మన్నారు. ఇతిహాసము లంటే - మహావీరుల చరిత్ర లనువర్ణించే పెద్దపద్యగ్రంథాలు. ఈమహద్గ్రంథములు రెండు- 'రామాయణము', 'మహాభారత'ములని నీకు తెలుసునుగదా!

ఈవీరచరితకావ్యయుగంలో ఆర్యులు ఉత్తరహిందూ స్థానమంతావ్యాపించి వింధ్యాద్రిని దరిసినారు. ఆ భాగాన్ని ఆర్యావర్త మన్నారు. ఇప్పటి సంయుక్తరాష్ట్రాలు నడుమను వుండుటచే మధ్యదేశ మన్నారు. బెంగాలు వంగదేశ మనబడినది.

నీవు తెలుసుకోదగిన ఒకవిచిత్రాంశమున్నది! హిందూ దేశ రూపపటాన్ని చూచి, హిమాలయ వింధ్యపర్వతాల మధ్య వుండిన ఆర్యావర్తదేశాన్ని వూహించుకొంటే, ఆ భాగం చంద్రరేఖవలె గాన్పిస్తుంది. కాబట్టి ఆర్యావర్తానికి ఇందుభూమి * అని నామాంతరం గూడ వుండినది.

ఆర్యులకు బాలేందురేఖపట్ల అత్యంతప్రీతి. చంద్ర వంకవలెవుండే భూభాగాలన్ని ముఖ్యంగా వారికి పవిత్రా లైనవి. వారి ప్రధానపట్టణాలు చాలవరకు వారణాసి (బెనారస్) వలె నెలవంక ఆకృతిలో నిర్మింపబడినవి. నీకు తెలుసు

---

* ఇందు అంటే చంద్రుడు. ఇందిర ముద్దుపేరు ఇందు.

నో తెలియదో, అలహాబాదులోగూడ గంగ అర్ధచంద్రా కారంగా ప్రవహించడం ఆశ్చర్యము !

'రామాయణం', సీతారాములు లంకాధీశుడు రావణునితో సలిపిన యుద్ధగాథ. లంకను నేడు సింహాళం అంటున్నాము. ఆదిలో రామాయణమాతృక వాల్మీకి మునిచేత సంస్కృతంలో వ్రాయబడినది. ఆ తర్వాత అనేక పాఠాంతరాలు యితర భాషలలో వ్రాయబడినవి. వాటిలో, తులసీదాసుకృత 'రామచరిత మానస్' అను హిందీ గ్రంథము విశ్వవిఖ్యాతము.

రామాయణంలో, శ్రీరామచంద్రునికి దక్షిణ భారతంలో కోతులు చాలా సహాయంచేసినట్లు వర్ణింపబడివున్నది. ఆ కోతులలో మహావీరుడు హనుమంతుడు. రామాయణ కథ ఉత్తర దేశ ఆర్యులకు, దక్షిణ దేశ అనార్యులకు జరిగిన పోరుగా వుంటుంది. దాక్షిణాత్యుల నేత రావణుడు. బహుశా, యీ "కోతులు" దక్షిణ దేశంలో నివసించుచుండిన నల్ల జాతివారై యుందురు.

రామాయణము సొంపైన కథలతో నిండివున్నది. ఇక్కడ వాటినన్నిటిని గురించి ప్రస్తావించలేను. నీవే స్వయముగా వాటిని చదువుకోవలెను.

'రామాయణము' తర్వాత, చాలాకాలానికి 'మహాభారతం' వచ్చింది. ఇది చాలా పెద్ద పుస్తకం. ఇది ఆర్యుల, ద్రావిడుల జగడములను గురించి చెప్పక, ఆర్యులే ఒకరితో నొకరు పోరాడుకొన్న గొప్ప యుద్ధమును వర్ణించుచున్నది.

యుద్ధం సంగతి అటుండ నిచ్చి, ఇది చాలా ఉద్గ్రంథము; మహోజ్జ్వలభావాలు, ఉదాత్తఆదేశాలు, ఉన్నతగాథలు ఇందు క్రిక్కిరిసి వున్నవి. ఆణిముత్యమునుపోలిన భగవద్గీత ఇందొక భాగమై యుండుటచేత 'మహాభారతము' మనకు మరింత ప్రియతమమై యున్నది.

అనేక వేల ఏండ్లకుముందు హిందూదేశంలో వ్రాయబడిన పుస్తకాలు ఇవి. మానవశ్రేష్ఠులుగాక ఇట్టి ఉత్కృష్ట గ్రంథము లింకెవరు వ్రాయగలుగుదురు ? అవి ఎప్పుడో వ్రాయబడిన వయినను, నేటికిని మనదేశంలో వాటికిగల ప్రచారం అఖండం. ప్రతిశిశువుకు గూడ అవి తెలియును. ఎదిగిన ప్రతివాడు గూడ వాటి నియమాలచేత నడపబడుతున్నాడు.



135

# సంస్కృతి ప్రచురణలు

## త్వరలో వెలువడనున్నవి.

1. బోస్ జియా ఉద్దీనుగా నున్నప్పుడు
   (సుభాస్‌బోస్ అంతర్ధాన గాథ)
2. నా జీవితం (My Early Life)
   రచన: మోహనదాస్ కరంచంద్ గాంధి
   ఆంగ్ల అనుసరణ, సంక్షిప్తీకరణ: మహాదేవ్ దేశాయ్
   ఆంధ్రీకరణము: పోలవరపు శ్రీరాములు
3. 1942 విప్లవం
4. ప్రపంచ చరిత్ర
   రచన: జవహర్‌లాల్ నెహ్రూ
5. రష్యానుంచి ఉత్తరాలు
   రచన: రవీంద్రనాథ్ టాగూర్
   అనువాదం: విద్వాన్ విశ్వం
6. భారతదేశం
   రచన: రొమైన్ రోలండ్ (పరాసు భాషలో)
   ఆంగ్లానువాదం: షెల్వంకర్
7. దీనబంధు ఆండ్రూస్ జీవితం

---

జవహర్‌లాల్ నెహ్రూ రచనలు

# సోవియట్ రష్యా

సంస్కృతి ప్రచురణ—4    పుటలు — 72    వెల రూ. 0-12-0

అనువాదము : పండితారాధ్యుల నాగేశ్వరరావు.

---

# ప్రపంచ చరిత్ర

(Glimpses of World History)



ఈ గ్రంథరాజమును ఆంధ్రీకరించి నాలుగు భాగములుగా, మూడు నెలల కొకభాగము చొప్పున ప్రచురింపనున్నాము. ఒక్కొక్క భాగమునకు సుమారు 400 పుటలుండును. వెల రూ. 4-0-0. మొదటిభాగము జవహర్‌లాల్ నెహ్రూగారి జన్మదినోత్సవమునాడు (14-11-46) వెలువడును. 1-8-46లోపున తమవిలాసములను విపులముగా వ్రాయుచూ, ఆర్డరుచేయువారికి తపాలాఖర్చులు మేమేభరించి నాలుగు భాగములు రూ. 16-0-0 కే పంపగలము. గ్రంథ విక్రేతలకు 20%, మా ఏజంట్లకు 25% కమీషను యివ్వబడును. వలయువారు వెంటనే యీ దిగువ విలాసమునకు వ్రాయనగును—

CULTURAL BOOKS LIMITED

PERAMBUR POST :: MADRAS

138

# సంస్కృతి ప్రచురణలు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | సోవియట్లదేశం * | .... | రూ. | 0- 8-0 |
| 2. | ఫ్రాన్స్ పతనం * | .... | ,, | 0- 8-0 |
| 3. | నేటి జపాన్ * | .... | ,, | 0- 8-0 |
| 4. | సోవియట్ రష్యా | .... | ,, | 0-12-0 |
| 5. | చైనాలో నూతన జీవితోద్యమం | | ,, | 0- 4-0 |
| 6. | బోల్షివిజం * | .... | ,, | 0- 4-0 |
| 7. | పాకిస్థాన్ * | .... | ,, | 0- 4-0 |
| 8. | సోవియట్ సంయుక్తరాష్ట్రం—మన మిత్రరాజ్యం | | | 0- 8-0 |
| 9. | ప్రపంచ ఆర్థిక దుస్థితి | .... | ,, | 0- 4-0 |
| 10. | సోవియట్లదేశం (రెండవ భాగం) | | ,, | 0-10-0 |
| 11. | నేటి చైనా | .... | ,, | 0-10-0 |
| 12. | ప్రజా యుద్ధం | .... | ,, | 0- 6-0 |
| 13. | యుద్ధకాలపు చైనా * | .... | ,, | 0- 4-0 |
| 14. | సోవియట్ రష్యాలో | .... | ,, | 0- 8-0 |
| 15. | లెనిన్ | .... | ,, | 0- 8-0 |
| 16. | గాంధీజీ * | .... | ,, | 0- 8-0 |
| 17. | హిందూ పద్ పాదుషాహి | .... | ,, | 2- 8-0 |
| 18. | డాక్టర్ కొట్నీస్ | .... | ,, | 1- 0-0 |
| 19. | ఇండియా స్వాతంత్ర్య సమస్య | .... | ,, | 0- 8-0 |
| 20. | ప్రపంచ పరిణామము (జవహర్‌లాల్ నెహ్రూ కుమార్తె ఇందిరకు వ్రాసిన లేఖలు) | .... | ,, | 1- 8-0 |

* ప్రతులు లేవు.

CULTURAL BOOKS LIMITED

**Perambur Post :: MADRAS**

